





నేను వ్వారందరినీ
నా ఎక్కో స్కెచ్
పెన్‌తో చిత్రించాను.

EKCO

స్కెచ్ పెన్‌తో

రంగులు, పిల్లలు వాటిని ఇష్టపడుతారు, వారు
డ్రాయింగు ఇష్టపడుతారు. మీపిల్లలలో
నిగూఢమైన ప్రతిభని వెలుపలికి తెండి.
అతనికి/ఆమెకి ఆకర్షనీయమైన ఎక్కో
స్కెచ్ పెన్‌ల పంచీని బహూకరించండి.
అవి ఆకర్షనీయమైన రంగులలో
వస్తున్నాయి.

డిస్ట్రిబ్యూటరు : కిరన్ & కం.
73/75 స్యామ్‌సెల్ స్ట్రీట్, బొంబాయి 400 002.
ఫోను : 324432

ఎక్కో స్కెచ్ పెన్‌లతో వ్రాయుటం
ఆనందదాయకం.

ADVERTS/WP/216/TEI G8

# జెమ్స్‌తో బలే మజా

## అదృష్టవంతులు గెలుపొందేందుకు 1001 బహుమతులు

ఇక్కడ లేని అంకె ఏమిటో చెప్పుకోండి చూద్దాం?






త్వరపడండి!
ఎంట్రీలు గ్రహింపబడేందుకు
ఆఖరు తేదీ : 12-10-1979




మీ జవాబుతోపాటు క్యాడ్‌బరీస్ జెమ్స్‌యొక్క ఖాళీ ప్లాస్టిక్ ప్యాకెట్ పెద్దది (30 గ్రాములది) ఒకటి జతపరచి పంపండి. సరియైన జవాబు పంపిన మొదటి 1001 మంది విజేతలకు రూ. 11 విలువగల స్టేట్ బ్యాంక్ కానుక చెక్‌లు లభిస్తాయి.

మీ జవాబు, మీ పేరు, మీ చిరునామా కూడా ఇంగ్లీషులోనే విడి అక్షరాలలో వ్రాయండి.

మీ ఎంట్రీలను ఈ క్రింది చిరునామాకు పంపండి.
"Fun with Gems", Dept. No. D-12
Post Box No. 56,
Thane 400 601, Maharashtra.

# చాక్లెట్ మధ్యలోగలిగిన రంగురంగుల క్యాడ్‌బరీస్ జెమ్స్

CHAITRA-C-263 TEL

# వీళ్ళు మన దేశానికి సంపద

## అందులో అత్యధిక భాగం యూకోబ్యాంక్ వారి రక్షణకు కేటాయించబడినది.

బాలలు దేశానికి పెట్టుబడిలాంటివారు. దేశము యొక్క భవిష్యత్తు పిల్లలు ఎంత బాగా పోషింప బడ్డారో ఎలా పైకి తీసికొని రాబడినారో, ఎలా విద్యాభ్యాసం గావించ బడినారో వీటిపై ఆధారపడి ఉంది. తల్లిదండ్రులు మాపై ఉంచిన నమ్మకానికి మేము అంగీకరిస్తున్నాము.

ఈ అంతర్జాతీయ బాలల సంవత్సరంలో మా మైనర్ల సేవింగ్స్ అకౌంట్లు చాలా వరకు పెరిగాయి. ఎక్కువ మంది తల్లిదండ్రులు వారి 'సంపదను' మాకు కేటాయిస్తున్నారని చెప్పడానికి ఇది చక్కటి నిదర్శనం



**యునైటెడ్ కమర్షియల్ బ్యాంక్**

మీకు దగ్గరలో వున్న మంచి నడుపాయాలున్న బ్యాంక్

UCO/CAS-41/79 TEL




# చందమామ


సంస్థాపకుడు : 'చక్రపాణి'

సంచాలకుడు : నాగిరెడ్డి


ఈ నెల బేతాళకథ [ "ఇంగితం లేనివాడు" ]కు ఆధారం బొమ్మిడి అచ్చారావు రచన. కోరికలను జయించటం అన్నిటికన్న "కష్టమైన పని". సమస్తాన్నీ విడిచిపెట్టిన సన్యాసి, మామూలు మనిషిగా తిరగక సన్యాసి వేషం వేసుకుని, తనను సన్యాసిగా లోకం గుర్తించాలని కోరుకుంటాడు. మనిషి బతికి ఉన్నంత కాలమూ, ఏదో కోరిక అంటి ఉండనే ఉంటుంది.

## అమరవాణి

కంటకానాం, ఖలానాం చ ద్వివిధైవ ప్రతిక్రియా,
ఉపాన న్ముఖభంగో వా, దూరతో వా విసర్జనమ్.

[ముండ్లకూ, దుష్టులకూ రెండు రకముల ప్రతీకారం; చెప్పుతో ముఖం మీద కొట్టటం, లేదా దూరంగా విసిరిపారెయ్యటం]


సంపుటి 65 సెప్టెంబర్ '79 సంచిక 3

విడి ప్రతి : 1-25 : : సంవత్సర చందా : 15-00


CHITRA




సి. శేకన్న, రాయచూరు (కర్ణాటక)

ప్ర: వేసవి కాలములో కొద్ది దూరముగా చూస్తే గాస్ స్టవ్ మండుతున్నట్టుగా ఉంటుంది. కేవలం ఎండాకాలములోనే ఎందుకలా కనిపిస్తుంది?

న: ఎండాకాలంలో నేల బాగా వేడెక్కి ఉండటంచేత నేలకు సమీపంగా ఉన్న గాలి వేడెక్కి, తేలిక అయి పైకి పోతుంది. అంత వేడిలేని ఎగువ గాలి హెచ్చు బరువు కావటంచేత కిందికి దిగుతుంది. ఈ రెండు రకాల గాలి ఒకదానికొకటి ఎదురువస్తూ కలిసినప్పుడు వాటికుండా జరిగే కాంతి ప్రసారం భిన్నంగా ఉండటం చేత దూరంగా ఉన్న వస్తువులు కంపించినట్టు కనబడతాయి. మండే స్టౌకు ఎగువగా ఇలా కనిపించటానికి కూడా ఇదే కారణం: చల్లని గాలి కుండా వచ్చే కాంతి వేడెక్కిన గాలిలోకి రాగానే వక్రీకరణం పొందుతుంది.

సిహెచ్. సుధ, నెల్లూరు (ఆంధ్ర)

ప్ర: నిద్ర అంటే ఏమిటి? కళ్లు మూసుకుంటేనేనా నిద్ర వచ్చేది?

న: మన మెదడు పై పొరలో అనేక "జ్ఞాన" కేంద్రాలున్నాయి. మేలుకుని ఉన్నప్పుడు బయటి వాతావరణంలో మార్పులకు – దృశ్యాలలోనూ, ధ్వనులలోనూ కలిగే వాటికి–అవి స్పందిస్తూ ఉంటాయి. మెదడుపై గల పొరలు విశ్రాంతి పొందితేనేగాని మనం నిద్రపోలేం. అందుచేత కళ్ళు మూసుకోకుండా నిద్రపోవటం సాధ్యం కాదు.

పి. వి. సుందర్‌కుమార్, బరంపురం (ఒరిస్సా)

ప్ర: ''ఫేన్'' తిరగకుండా ఉన్నప్పుడు దాని రెక్కల వెనుక ఉన్న వస్తువులు మనకు కనబడవు. కాని అది తిరుగుతున్నప్పుడు స్పష్టముగా కనబడతాయి. కారణము?

న: "ఫేన్" రెక్కల మధ్య ఖాళీ జాగాలకుండా వెనుక ఉన్న వస్తువులను మనం అది తిరిగేటప్పుడు చూస్తాం. ఒకసారి కంటబడిన దృశ్యం సెకండులో పదోవంతు కాలం కంటి నుంచి చెరగదు. ఈలోపుగా ఫేన్ రెక్క దాటిపోతుంది. అందుచేత మనం ఫేన్ వెనక ఉండేదాన్ని చూస్తాం. ఇంతకన్న మంచి ఉదాహరణ: మనం కళ్ళతో పనిచేసేటప్పుడు కళ్ళు ఆర్పుతూనే ఉంటాం. కాని మనం చూసేది అదృశ్యమయి మళ్ళీ కనిపిస్తున్నదన్న భావన మనకు కలగదు.




## 75

### తిరిగి బతికిన సింహం

నలుగురు బ్రాహ్మణ మిత్రులుండే వారు. వారిలో ముగ్గురు సమస్తశాస్త్రాలూ తెలిసిన వారే. కాని వారికి లోకజ్ఞానం లేదు. నాలుగో వాడికి ఏ శాస్త్రమూ రాదు గాని, లోకజ్ఞానం పుష్కలంగా కలవాడు.

ఒకనాడు నలుగురూ ఒక చోట కలిసి, "చదువుకున్నందుకు ప్రయోజనం ఏమిటి? నానాదేశాలూ తిరిగి, రాజులను మెప్పించి, బహుమానాలు పొందాలి! కనక మనం దేశసంచారం బయలుదేరుదాం," అనుకున్నారు.

వాళ్ళు బయలుదేరి కొంత దూరం వెళ్ళినాక, వారిలోకెల్లా పెద్దవాడు ఇలా అన్నాడు: "మనలో ఒకడికి లోకజ్ఞానం ఉన్న దన్నమాటే గాని, పాండిత్యం లేదు. పాండిత్యం లేకపోతే, లోకజ్ఞానం ఉన్నందుకు ఏ రాజూ సన్మానించడు. మిగిలిన ముగ్గురూ సంపాదించుకునే బహుమానాల నుంచి వాడికి వాటా రాదుకూడా. అందుచేత వాడు ఇంటికి తిరిగిపోవచ్చు."

రెండో పండితుడు లోకజ్ఞానితో, "నువు పండితుడివి కావు. తిరిగి పో," అన్నాడు.

కాని మూడో పండితుడు, "మనం వాణ్ణి ఇంటికి తిరిగి వెళ్ళమనటం అన్యాయం. మనం నలుగురమూ బాల్యం నుంచీ కలిసి తిరిగి, కలిసి ఆడుకున్నాం. వీణ్ణి మన వెంట రానిచ్చి, మన సంపాదనలో ఒకవంతు ఇద్దాం," అన్నాడు.

అందుకు మొదటి ఇద్దరూ సరేనన్న మీదట, నలుగురూ ప్రయాణం కొనసాగించారు.

కొంత కాలానికి వారు అరణ్యం చేరుకుని, అక్కడ చచ్చిన సింహం ఎముకలు



చూశారు. వాటిని చూసి ఒక పండితుడు, "ఇప్పుడు మనం మన విద్యలు నిరూపించుకోవచ్చు. మన శక్తితో మనం ఈ సింహాన్ని తిరిగి బతికించుదాం. నేను ఈ సింహం ఎముకలను ఎక్కడ ఉండవలసినవి అక్కడ అమర్చగలను," అన్నాడు.

"నేను సింహం చర్మమూ, కండరాలూ, రక్తమూ సృష్టించగలను," అన్నాడు రెండో పండితుడు.

"మీరిద్దరూ అలా చేసే మాటైతే నేను సింహానికి ప్రాణం పొయ్యగలను," అన్నాడు మూడో పండితుడు.

అన్నట్టుగానే ఒకడు సింహం అస్థి పంజరం కూర్చి, రెండోవాడు దానికి చర్మమూ, మాంసమూ, రక్తమూ కలిగించి, మూడోవాడు ప్రాణం పోయబోతూండగా, నాలుగోవాడు, "ఇది సింహం! దీనికి ప్రాణం వస్తే ఇది మన అందరినీ చంపేస్తుంది. అందుచేత ప్రాణం పొయ్యవద్దు," అన్నాడు.

దానికి మూడోవాడు, "ఛీ, మూఢుడా! మిగిలిన ఇద్దరూ వాళ్ళ తెలివి తేటలు రుజువు చేసుకున్న తరవాత నన్ను నా శక్తి చూపటం మానుకోమంటావా?" అన్నాడు.

లోకజ్ఞానం కలవాడు, "నీ యిష్టం. నేను ఈ చెట్టు ఎక్కేదాకా ఆగు," అంటూ సమీపంలో ఉన్న చెట్టు ఎక్కేశాడు.

తరవాత మూడో పండితుడు సింహానికి ప్రాణం పోశాడు. ప్రాణం వస్తూనే సింహం గర్జిస్తూ విజృంభించి, తనను బతికించిన ముగ్గురు పండితులనూ చంపేసింది. సింహం వెళ్ళిపోయినాక, లోకజ్ఞాని చెట్టు దిగి, క్షేమంగా ఇల్లు చేరాడు.

అతిలోభి అత్యంతలోభికి ఈ కథ చెప్పి, "ఒక్క తామరపువ్వుతో పుష్కరిణి కాదు. అలాగే ఈ ఒక్క కథలోని నీతి చాలదు. ఇలాటి కథలు ఇంకా చాలా ఉన్నాయి." అని మరొక కథ చెప్పాడు.

### చదువుకున్న మూఢులు

ఒకప్పుడు ఉజ్జయినిలో నలుగురు బ్రాహ్మణ బాలకులు స్నేహంగా ఉండే

వాళ్లు. వాళ్ళు కూడబలుక్కుని, దేశాంత రాలకు వెళ్ళి విద్యాధికుల మవుదాం అనుకున్నారు. తరవాత వాళ్లు కన్యా కుబ్జం వెళ్లి, ఒక ప్రసిద్ధుడైన గురువు వద్ద పన్నెండేళ్ళపాటు అమిత శ్రద్ధగా చదువుకున్నారు.

వాళ్ళు విద్యాభ్యాసం పూర్తి చేసి, గురువుగారి వద్ద సెలవు పుచ్చుకుని, తమ పుస్తకాలతో సహా ఉజ్జయినికి తిరుగు ప్రయాణమయారు. కొత్త ప్రాంతాలు చూసినట్టు ఉంటుందనీ, ఎరగని మార్గంలో ప్రయాణం చేసే తెలివితేటలు తమ కున్నాయనీ, వాళ్లు వచ్చిన మార్గం విడిచిపెట్టి, సరికొత్త మార్గాన ఉజ్జయినికి ప్రయాణమయారు.

వారు కొంతదూరం వెళ్ళాక దారి రెండుగా చీలింది. ఏదారి పుచ్చుకోవాలో వారికి తెలియలేదు. ఒకడు ఇలా అన్నాడు:

"ఏ దారిన వెళ్ళాలన్నది సమస్య. నా పుస్తకం ఏం చెబుతున్నదంటే, చదువు కున్న వాడికి కర్తవ్యం దానంతట అదే తెలుస్తుంది. వాడు మరొకర్ని అడిగేపని ఉండదు. కాని మూఢుడు అస్తమానమూ ఇతరుల సలహాపైనా, సహకారంపైనా ఆధారపడతాడు. అందుచేత మనం ఎటు వెళ్ళాలని ఇతరులను అడిగే ప్రశ్నలేదు. అది మనమే నిర్ణయించుకుందాం."



నలుగురూ దారులు చీలే కూడలిలో కూర్చుని, తమ తమ పుస్తకాలు తెరిచారు. అదే సమయంలో అక్కడి దారులలో ఒకదాని వెంట ఒక శవమూ, దాని వెనకగా అనేకమంది మనుషులూ వచ్చారు. వెంటనే చదువుకున్న నలుగురిలో ఒకడు, "సమస్య తీరిపోయింది! నలుగురు నడిచిన దారినే నడవమని నా పుస్తకం చెబుతున్నది. మనం ఈ జనం వెళ్ళేదారినే వెళదాం," అన్నాడు.

సమస్య ఇంత సులభంగా పరిష్కార మైనందుకు మిగిలిన ముగ్గురూ సంతోషంతో కేరింతాలు కొట్టారు. వాళ్ళు శవం ఊరేగింపు వెనకనే వెళ్లి, త్వరలోనే

శ్మశానం చేరుకున్నారు. దారి అక్కడ ఆగిపోయింది.

విద్యావంతులు చితికి కొంత దూరంగా నిలబడి, ఇప్పుడేం చెయ్యాలి అనుకున్నారు. అక్కడే ఒక గాడిద కూడా నిలబడి ఉండటం వారికి కనబడింది.

"దీనికేదో అర్థం ఉండాలి. మనతో బాటు ఈ గాడిద కూడా నిలబడి ఉండటానికి అర్థం ఏమై ఉంటుంది?" అని ఒకడు అన్నాడు.

వెంటనే మరొకడు పుస్తకంతీసి చూసి, "నాకు తెలిసింది! ఈ గాడిద మన మిత్రుడు. 'రాజద్వారే, శ్మశానే చ యస్తిష్ఠతి సబాంధవః,' అని నా పుస్తకంలో ఉన్నది. అందుచేత మనం ఈ గాడిదను స్నేహపూర్వకంగా పలకరించుదాం," అన్నాడు.

ఒకడు వెళ్ళి గాడిద కంఠాన్ని ఆప్యాయంగా కౌగలించుకున్నాడు. ఇంకొకడు గాడిదను ముద్దు పెట్టుకున్నాడు. మరొకడు దాని పాదాలు కడిగాడు. నాలుగోవాడు, బహుకాలదర్శనం, అని ఆనంద బాష్పాలురాల్చాడు.

వాళ్ళను చూసి, శవంతో వచ్చినవాళ్ళు అంత విషాదంలోనూ విరగబడి నవ్వారు.

అంతలో ఒక ఒంటె, అటుగా పరిగెత్తుకుంటూ వచ్చింది. "దీని అర్థం ఏమై ఉంటుంది?" అని ఒక విద్వాంసుడు అడిగాడు.

"ధర్మస్య త్వరితా గతిః అని నా పుస్తకంలో ఉన్నది. పరిగెత్తుకుంటూ వచ్చింది గనక, ఈ ఒంటె ధర్మం అయి ఉండాలి," అన్నాడు మరొకడు.

మూడోవాడు, "ఇష్టం ధర్మేణ యోజయేత్ అని నా పుస్తకంలో ఉన్నది. అంటే మన కిష్టమైన దాన్ని ధర్మంతో సంధించాలి. కనక మనం గాడిదనూ, ఒంటెనూ కలిపి కట్టుదాం," అన్నాడు.

నలుగురూ కలిసి అతికష్టం మీద గాడిదనూ, ఒంటెనూ తాడుతో కలిపి కట్టి, చాలా తన్నులు తిన్నారు. శ్మశానంలో ఉన్న వాళ్ళంతా పగలబడి నవ్వారు.





# భల్లూకమాంత్రికుడు

## 15

[కాళీవర్మ తన అనుచరులతో కోటలో ప్రవేశించాడు. మాయామర్కటం తెగిన తల నొకదాన్ని వాళ్ళకు చూపింది. అది రాజు దుర్ముఖుడిది కాదని వాళ్ళు గ్రహించి, అతడి కోసం వెతుకు తున్నంతలో, సభామంటపం లోని సింహాసనం మీద దుర్ముఖుడు కనిపించాడు. ఆ మరుక్షణం తలారిభల్లూకుడు ఏనుగు మీదినుంచి గొడ్డలితో సభామంటపంలోకి దూకాడు. తరవాత—]

తలారి భల్లూకుడు సభామంటపం లోపలికి రాకటం చూస్తూనే కాళీవర్మ రానున్న ప్రమాదాన్ని గుర్తించి, ఏనుగు మీద వున్న ఆటవికుడితో, "ఒరే, ఆటవికా! చప్పున పోయి భల్లూకుడు రాజు దుర్ముఖుడి తల నరకకుండా ఆటకాయించు," అని, పెద్ద గొంతుతో, "తలారి భల్లూకా, నేను వస్తున్నాను. రాజును చంపకు," అని కేక పెట్టి, మెట్ల మీదుగా సభామంటపంలోకి పరిగెత్త సాగాడు.

కాళీవర్మ హెచ్చరిక వింటూనే, ఆటవికుడు ఏనుగు మీది నుంచి దూకి, పరుగున పోయి తలారి భల్లూకుడికి అడ్డంగా నిలబడుతూ, "భల్లూకయ్యా, తొందరపడకు. కాళీవర్మ దొర, రాజు తల నరకవద్దని హెచ్చరిస్తున్నాడు," అన్నాడు.



తలారి భల్లూకుడు అశ్చర్యపడుతూ, "తనను అవమానించిన యీ రాజు తల నరికి తెమ్మని భల్లూక మాంత్రికులవారి అజ్ఞ కదా! ఆయన అజ్ఞ నెరవేర్చకపోతే, తిరిగి నన్ను సొంతం ఎలుగుబంటుగా మార్చేస్తాడు." అన్నాడు.

అంతలో అక్కడికి కాళీవర్మ చేరి, సింహాసనంలో కదలా మెదలక కూర్చుని వున్న రాజు దుర్ముఖుడి కేసి ఒకమారు చూసి, వింతపడుతూ, "ఈ రాజు కేమయింది? అలా కళ్ళు మూసుకుని చలనం లేకుండా వున్నాడేం?" అన్నాడు.

తలారి భల్లూకుడు గండ్రగొడ్డలిని భుజం మీద పెట్టుకుని, "కాళీవర్మ దొరా, ఏమిటి మీ అజ్ఞ? ఈ రాజు తల నరకవద్దంటారా?" అని అడిగాడు.

కాళీవర్మ, దుర్ముఖుడిని సమీపించి, "భల్లూకా, నువు తల నరక్కుండానే, యీ దుర్ముఖుడు ప్రాణం వదిలినట్టుంది. ఏం జరిగివుంటుంది? గండ్రగొడ్డలితో నువ్వు మీదికి రావటం చూసి, ఆ భయంలో యితడి గుండె ఆగిపోలేదు కదా?" అన్నాడు.

"తలారి భల్లూకుడు, దుర్ముఖుడి తల నరికివేశాడా ఏం?" అంటూ భల్లూక మాంత్రికుడు అక్కడికి వచ్చి, సింహాసనంలో కదలా మెదలక వున్న రాజును చూసి, "పాపం, ప్రాణభీతితో మూర్ఛపోయి వుంటాడు," అంటూ కత్తిని అతడి భుజానికి తాకిస్తూ, "రాజా దుర్ముఖా! మూర్ఛ తేరుకో. నీ కొచ్చిన ప్రాణభయం ఏమీలేదు," అన్నాడు.

ఆ వెంటనే దుర్ముఖుడు కళ్ళు తెరిచి, చేతులతో తలను తడివి చూసుకుంటూ, "ఆహాఁ, నా శిరస్సు ఎంత చేవగలది! తలారి భల్లూకుడి గండ్రగొడ్డలి దెబ్బకు చెక్కు చెదరకుండా నిలబడిందన్నమాట!" అన్నాడు.

ఆ మాటలకు అందరూ పెద్దగా నవ్వారు. దుర్ముఖుడు గాభరాపడుతూ సింహాసనం మీదినుంచి లేచి, "కాళీ

వర్మ, మాంత్రికులూ అందరూ యిక్కడే వున్నారన్నమాట! మరొకసారి సింహాసనం మీద కూర్చోవాలన్న కోర్కె తీరింది. ఇక నా తల తెగిపోయినా, నే విచారించను,'' అన్నాడు.

కాళీవర్మ, దుర్ముఖుడి భుజాలు పట్టుకుని సింహాసనంలో కూర్చోబెట్టి, ''రాజా దుర్ముఖా, నువ్విప్పుడు మా మిత్రుడివి. జరిగిందంతా మరిచిపో. నీ కోట ఆక్రమించిన సామంతు సూర్యభూపతీ, నా గురువు భల్లూకమాంత్రికుల మంత్రదండాన్ని అపహరించిన మాయామర్కటం యిప్పుడు ఏకమయ్యారు. ముందు మనం వాళ్ళను పట్టుకోవాలి,'' అన్నాడు.

కాళీవర్మ యిలా అనగానే రాజు దుర్ముఖుడు ఎక్కడలేని సంతోషంతో సింహాసనం మీది నుంచి వేగంగా సభామంటపం ముందుకు వచ్చి, కత్తి పైకెత్తి పట్టుకుని, పెద్దగొంతుతో, '' ఒరే, ఉదయగిరి రాజునైన నేను ఆజ్ఞాపిస్తున్నాను! విశ్వాసపాత్రులైన సైనికులంతా తక్షణం యిక్కడికి రండి. అలా రానివాళ్ళను రాజద్రోహులుగా భావించి, శిరశ్ఛేదాలు చేయిస్తాను,'' అన్నాడు.

తలారిభల్లూకుడు మంటపం పిట్టగోడ మీద నిలబడి, గండ్రగొడ్డలి ఝుళిపిస్తూ, ''ఓహోయ్, కోటలో అక్కడా యిక్కడా,



మారుమూల దాగివున్న వాళ్లంతా, దుర్ముఖ రాజుగారి ఆజ్ఞ విన్నారా? అందరూ రెక్కలు కట్టుకుని మరీ వచ్చి ఇక్కడ వాలాలి,'' అన్నాడు భీకరస్వరంతో.

ఆ మరుక్షణం కోట అన్ని ప్రాంతాల నుంచీ సైనికులు సభామంటపం ముందుకు రాసాగారు. నాలుగైదు నిమిషాల కాలం గడిచిన తరవాత కాళీవర్మ వాళ్ళనందరినీ లెక్కించి, రాజు దుర్ముఖుడితో, ''రాజా దుర్ముఖా! నీ సైనికులందరూ కలిసి నలభైమంది కన్న ఎక్కువ లేరు. ఇదేనా ఉదయగిరి రాజువైన నీ సైనిక బలం?'' అని అడిగాడు.



రాజు దుర్ముఖుడు అవమానభారంతో తల వంచుకుని, "కాళీవర్మా, నా సైనికు లందర్నీ ఆ సామంతు సూర్యభూపతి ధనాశ చూపించి తన పక్షం చేసుకున్న ట్టున్నది. ముందు మనం ఆ ద్రోహిని వెతికిపట్టుకోవాలి," అన్నాడు.

కాళీవర్మ, భల్లూకమాంత్రికుడి కేసి తల తిప్పి, "గురూ, ఏమిటి తమ ఆజ్ఞ?" అని అడిగాడు.

భల్లూకమాంత్రికుడు సభామంటపం పిట్టగోడ నానుకు నిలబడి, కోట గోడల కేసి చూస్తున్నాడు. అతడికి తన మంత్ర దండం పోవటం చాలా బాధగా వున్నది. అంతేకాక యిప్పుడు తానా ప్రాంతాలు వదిలిపోతే, రాజు దుర్ముఖుడు శత్రువుల వల్ల చిక్కుల పాలవుతాడు. పైగా, యిప్పటి పరిస్థితులలో కాళీవర్మ కూడా తన గురువైన భల్లూకపాదుడు వున్న ప్రాంతానికి రా నిరాకరించవచ్చు...

భల్లూకమాంత్రికుడు యిలా ఆలో చిస్తూ, కాళీవర్మతో, "శిష్యా కాళీ! నా ఆజ్ఞల మాట అలా వుంచుదాం. నువ్వు ఏం చేయాలనుకుంటున్నావు?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు కాళీవర్మ ఆశ్చర్యపోతూ, "గురూ, యిదేం ప్రశ్న! ఒకసారి నన్ను తమ గురువుగారుండే భల్లూకపాద పర్వ తాలకు రమ్మని అడిగారు. ఆ మాట మరిచారా?" అన్నాడు.

ఆ జవాబుకు భల్లూకమాంత్రికుడు ఆనందపడుతూ, "శిష్యా కాళీ! నీ గురు భక్తి మెచ్చదగింది. నా గురువైన భల్లూక పాదుడు ఒకానొక తాంత్రికుడి కారణంగా ప్రస్తుతం చిక్కుల్లో వున్నాడు. అతడికి నీవంటి ధైర్యసాహసాలుగల వాడి నుంచి కొంత సహాయం కావాలి. అందుకు ప్రతి ఫలంగా నువ్వు కోరేదేమిటో చెప్పు?" అన్నాడు.

కాళీవర్మ ఒక్కక్షణం ఆలోచించి, "గురూ, ప్రతిఫలాల మాట తరవాత చూద్దాం. రాజు జితకేతుడు నాకు శిర

శ్చేద శిక్ష విధించినప్పుడు దిరిశెనవనంలో మీరు నాకు చాలా సాయపడ్డారు. అప్పుడే మీకు అన్నివిధాలా సహాయపడగలనని మాట యిచ్చాను. ఇప్పుడేం చేయాలో ఆజ్ఞాపించండి,'' అన్నాడు.

''అలా అయితే, నువ్వు నాతోపాటు బ్రహ్మపుత్రానది జన్మస్థాన ప్రదేశాన వున్న భల్లూకపాద పర్వతాలకు రావాలి,'' అన్నాడు భల్లూకమాంత్రికుడు.

''సరే, బయలుదేరండి!'' అంటూ కాళీవర్మ కదిలాడు.

రాజు దుర్ముఖుడు నిలువెల్లా వణికి పోతూ, ''మాంత్రిక ప్రభో! తమరు నా మాట మరిచినట్టున్నది. ఈ కొద్ది మంది సైనికులతో నేను రాజుగా మన గలగటం అసాధ్యం. నేనూ తమ వెంట భల్లూకపాద పర్వతాలకు వస్తాను,'' అన్నాడు.

భల్లూకమాంత్రికుడు ఏదో అనబోయేం తలో తలారిభల్లూకుడు గండ్రగొడ్డలిని నేలకు వేసి కొట్టి, ఏడుపు గొంతుతో, ''అయ్యో, నా సంగతేమిటి? మీరంతా యిక్కణ్ణించి వెళ్లిన తరవాత నా పాత యజమాని జితకేతరాజు, తన అజ్ఞ ధిక్క రించినందుకు నన్ను అడవిమృగం కింద వేటాడేస్తాడు. నన్నూ తమ వెంట తీసుకు పొండి,'' అన్నాడు.



భల్లూకమాంత్రికుడు చిరునవ్వు నవ్వి, తలారి భల్లూకుడి భుజం తడుతూ, ''భల్లూకా, భయపడకు! నేను, నీ సంగతీ రాజు దుర్ముఖుడి సంగతీ మరిచిపోయా ననుకోకు. మీ యిద్దరి క్షేమం చూశాకే నేనీ ప్రాంతాల నుంచి వెళతాను. చంద్ర శిలా నగరరాజు ఆ జితకేతుడు కాళీ వర్మతోపాటు నన్నూ అవమానించాడు. మనం ముందు ఆ నగరం పోయి, ఆ రాజు అంతేదో చూడవలసి వున్నది,'' అన్నాడు.

''ఆ పొగరుబోతు రాజు మంత్రి అయిన జీవగుప్తుడు కొద్దిమంది సైనికులతో కోట వెలపల కాపలా వేసివున్నాడు. వాడు



హఠాత్తుగా మన మీద వచ్చి పడకుండా రాక్షసుడు ఉగ్రదండుడు అడ్డుగా నిలబడ్డాడు. మరి, యీ సామంతుడు సూర్యభూపతీ, మాయామర్కటం కోటలో ఏ మూలనైనా దాగివున్నారో, లేక పారి పోయారో తెలియటం లేదు,'' అన్నాడు కాళీవర్మ.

కాళీవర్మ యిలా అనగానే తలారి భల్లూకుడు గండ్రగొడ్డలి భుజాన పెట్టు కుని, ''కాళీవర్మ దొరా! నేను ఏనుగు మీద ముందుగా కోట బయటికి పోయి, పరిస్థితి ఎలా వున్నదో చూస్తాను. రాక్షసుడు ఉగ్రదండుడికి నేను తోడుగా రావటం చూస్తూనే, ఆ మంత్రీ, సైనికులూ చంద్ర శిలా నగరం కేసి పారిపోయినా పారి పోతారు,'' అన్నాడు.

"సరే, నువ్వు అలాగే వెళ్ళు. మేం ఒక సారి ఆ సామంతూ, మాయామర్కటాల కోసం కోట ప్రాంతాలు గాలించి, వెనగ్గా వస్తాం,'' అన్నాడు కాళీవర్మ.

''ఒరే, అటవిక సేవకా! ఏనుగును మంటపం కేసి మరి కాస్త ముందుకు తీసుకురా,'' అని కేక పెట్టాడు తలారి భల్లూకుడు.

అటవికుడు ఏనుగును మంటపం దరికి నడపగానే తలారి భలూకుడుపోయి దాని మీద కూర్చున్నాడు. అంతవరకూ మౌనంగా వుండి అంతా శ్రద్ధగా వింటున్న రాజు దుర్ముఖుడు, భల్లూక మాంత్రి కుడితో, ''మాంత్రిక ప్రభో! నేను యీ కొద్దిమంది సైనికులతో, యీ కోటలో వుండటం క్షేమం కాదు. మీ వెంట నేనూ బయలుదేరి చంద్రశిలానగరం వస్తాను,'' అన్నాడు.

''నేనూ అదే చెప్పబోతున్నాను. నీ నలభైమంది సైనికులతో నువ్వు కొత్తగా ఒక రాజ్యాన్నే జయించబోతున్నావు, సరా?'' అన్నాడు భల్లూక మాంత్రికుడు.

ఆ తరవాత అందరూ సభామంట పంలో నుంచి కిందికి వచ్చి, సామంతు, మాయామర్కటాలను వెతికేందుకు.

సైనికులను అజ్ఞాపిస్తున్నంతలో కోట గోడల మీది కెక్కిన రాజు దుర్ముఖుడి అంగరక్షకు లిద్దరూ ఏక కంఠంగా, "మహా రాజా, మన సామంతూ, మాయకోతీ జితకేతరాజు మంత్రి పక్కన వున్నారు. వాళ్ళు రాక్షసుడితో ఏదో మాట్లాడు తున్నారు," అని కేక పెట్టారు.

"గురూ, యిలా జరుగుతుందన్న అనుమానం నాక్కలగక పోలేదు. కాలిన కోట ద్వారాల దగ్గిర మనం తగిన కాపలా పెట్టవలసింది. బహుశా ఆ దుర్మార్గులు రాక్షసుడు ఉగ్రదండుణ్ణి తమ పక్షం చేసుకునే ప్రయత్నాలు చేస్తూ వుండి వుంటారు," అన్నాడు కాళీవర్మ.

"కాళీ, ఆ ప్రయత్నాలేమీ ఫలించవు. ఆ రాక్షసుడు నా నుంచి ఏదో సాయం ఆశిస్తున్నాడు. ఇక మనం బయలుదేరు దాం," అన్నాడు భల్లూక మాంత్రికుడు.

కాళీవర్మ ఊహించినట్టే రాజు జిత కేతుడి మంత్రి జీవగుప్తుడు, ఉగ్రదండు డికి పెద్ద పెద్ద ఆశలు చూపి, తన పక్షం చేసుకునే ప్రయత్నం చేస్తున్నాడు. అందుకు మాయామర్కట రూపంలో వున్న భ్రాంతిమతి వంత పాడుతున్నాడు.

రాక్షసుడు ఉగ్రదండుడు రాతిగద పైకెత్తి పట్టుకుని, "నాకు మీ ఎవరి నుంచీ సహాయం అవసరంలేదు. భల్లూక పాద



పర్వతాల్లో నా బంధు వొకడున్నాడు. అతణ్ణి బంధవిముక్తుణ్ణి చేయాలి," అంటున్నాడు.

ఆ మాటలకు మాయామర్కటుడు హేళనగా కిచకిచమంటూ అరిచి, "ఉగ్ర దండా, ఆ బంధు వెవరు, నీ అన్నే గదా? ఇంకా బంధ విముక్తేమిటి? నా గురువు తాంత్రిక మిథ్యామిశ్రుడు అతణ్ణి ఏనాడో భూస్థాపితం చేశాడు. నువు బుద్ధిగా యిక్కడే, జితకేతరాజు ఆశ్రయంలో వుంటూ సుఖంగా కాలం వెళ్ళబుచ్చటం మంచిది," అన్నాడు.

"నా అన్నను ఆ తాంత్రికుడు నిజంగా చంపాడా? లేక నువు అబద్ధం ఆడు

తున్నావా?'' అంటూ ఉగ్రదండుడు పళ్ళు కొరికాడు.

మాయామర్కటుడు ఏదో అనబోయేంతలో మంత్రి జీవగుప్తుడు అతణ్ణి వారిస్తూ, ''ఉగ్రదండా! గతం అంతా మరిచిపో. మా రాజ్యంలో మహా బలశాలి అయిన రాక్షసుడొకడున్నాడన్నది మాకెంతో గర్వ కారణంగా వుంటుంది. అలాగే నువ్వు శేషజీవితాన్ని మా రాజుగారి చల్లని నీడలో సుఖంగా గడిపెయ్యవచ్చు,'' అన్నాడు.

''అంటే, నా నుంచి ఎలాంటి సహాయం కోరకుండానే, మీ రాజు నాకు ఆతిథ్యం యిస్తాడన్నమాట, అవునా?'' అన్నాడు ఉగ్రదండుడు.

''నీ నుంచి ఒకే ఒక సహాయం చాలు. మేం యిప్పుడు కోటలో ప్రవేశించబోతున్నాం. అక్కడ భల్లూక మాంత్రికుణ్ణీ, కాళీవర్మ అనే నేరస్థుణ్ణీ, రాజు దుర్ముఖుణ్ణీ నిలువునా చీల్చి చెండాడేందుకు కొంచెం సహాయపడు, చాలు!'' అన్నాడు మంత్రి జీవగుప్తుడు.

ఉగ్రదండుడు జవాబివ్వబోయేంతలో కోటలో నుంచి ఎనుబోతు వాహనం మీద వున్న భల్లూక మాంత్రికుడితో పాటు అందరూ ఒక్కసారిగా బయిటికి వచ్చారు. వాళ్లను చూసి భయకంపితుడై పోయి, మంత్రి ఏమి చేయుటమా అని ఆలోచిస్తూ, పక్కనే గుర్రాల మీద వున్న సామంతూ, మాయామర్కటాల కేసి చూశాడు.

రాక్షసుడు ఉగ్రదండుడు ఒకసారి పెద్దగా హుంకరించి, ''మంత్రీ! సహాయం చేయమన్నావు గదా? ఇదిగో, నీకూ, నీ వెంట వున్న దుష్టగణానికీ నే చేయబోతున్న సహాయం యిది!'' అంటూ రాతి గద ఎత్తి, అందుబాటులో వున్న మాయామర్కటుడి తల కేసి విసిరాడు.

మాయామర్కటుడు మెరుపు వేగంతో కీచుమంటూ గుర్రం మీది నుంచి పైకెగిరాడు. ఉగ్రదండుడి రాతి గద పోయి అతడెక్కి వున్న గుర్రం తలను తాకింది. —(ఇంకా వుంది)






# ఇంగితం లేనివాడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్లి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి బయలుదేరాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నీ మంచిని నువ్వు ఏమరి ప్రవర్తిస్తున్నావేమో నాకు తెలీదు. కాని కొందరు తమకు అయాచితంగా లభించిన అదృష్టాన్ని తెలుసుకోకుండానే పోగొట్టుకుంటారు. ఇందుకు నిదర్శనంగా నీకు వీరవర్మ కథ చెబుతాను విను.'' అంటూ ఇలా చెప్పసాగాడు:

మాళవదేశపు యువరాజు కల్యాణవర్మకు వీరవర్మ ఆప్తమిత్రుడు. అయితే వీరవర్మ మాళవ దివాణంలో ఒక ఉద్యోగి కొడుకు మాత్రమే. అయినా కల్యాణవర్మ అతన్ని తనతో సమంగా చూసుకుని ఆదరించేవాడు. ఆ ఇద్దరిదీ ఏదో పూర్వజన్మబంధం అని అందరూ అనుకునేవారు.

## బేతాళ కథలు



ఒకసారి వీరవర్మ ఏకాంతంగా అరణ్యంలో వేటాడబోయాడు. అక్కడ అతనికి ఆకస్మికంగా ఒక స్త్రీ ఆర్తనాదం వినిపించింది. వీరవర్మ తన గుర్రాన్ని అటుగా పోనిచ్చి ఒక నిస్సహాయురాలిని చూశాడు. ఆమె ఒక గుర్రంమీద ఉన్నది. ఆ గుర్రం ఆమెకు లొంగక, వెనక కాళ్ళ మీద నిలబడి, ఆమెను పడెయ్యటానికి విశ్వప్రయత్నం చేస్తున్నది. గుర్రం కళ్ళు చూస్తే అది ఏ కారణం వల్లనో బెదిరి నట్టు కనిపించింది.

వీరవర్మ చప్పున తన గుర్రాన్ని ఆ బెదిరిన గుర్రానికి ఎదురు నడిపించి, దాని కళ్లెం పట్టుకుని, కిందికిలాగి, దాని ముందుకాళ్లు నేలమీదికి దిగేటట్టు చేసి, గుర్రాన్ని మెల్లిగా తట్టి, దాని భయం తగ్గించాడు.

గుర్రం మీద ఉన్న స్త్రీ గుర్రం కన్న కూడా ఎక్కువగా బెదిరినట్టు కనిపించింది. తాను అరణ్యం అవతల ఉన్న ఉదయ పుర రాజకుమార్తె ననీ, తన పేరు స్వర్ణ కేశి అనీ, తాను వన విహారానికి సపరి వారంగా వస్తే, పెద్ద పులి గాండ్రింపు విని తన గుర్రం బెదిరి, కొంత దూరం అరణ్యంలోకి పరిగెత్తి, తాను కళ్లెం గట్టిగా లాగి ఆపటానికి ప్రయత్నిస్తే తనను పడెయ్యటానికి ప్రయత్నించిందనీ, అతను తనను పెద్ద ప్రమాదం నుంచి కాపాడాడనీ తన కృతజ్ఞత తెలుపుకుని, అతన్ని మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్న లక్షణాలు కనబరిచింది.

ఇద్దరూ తమ గుర్రాలను కొంతదూరం నడిపించారు. స్వర్ణకేశి అతనితో తన తండ్రి తన వివాహంగురించి ప్రయత్నాలు చేస్తున్నాడనీ, అయితే నిన్నటి వరకూ తన మనసును ఆకర్షించగలిగిన పురుషుడు ఎవరూ లేకపోయాడనీ, తన తండ్రి తన స్వయంవరం ప్రకటించే పక్షంలో తప్పక రావాలనీ వీరవర్మతో అని, "ఇంతకూ మీ రెవరో నాకు చెప్పనే లేదు," అన్నది.

"నేను మాళవయువరాజును. నాపేరు కల్యాణవర్మ." అని వీరవర్మ ఆమెతో అబద్ధం చెప్పాడు.

"మంచిది! నా స్వయంవరానికి రావటం మరవవద్దు." అన్నది స్వర్ణకేశి. ఇంతలో ఆమె పరివారం వాళ్ళు ఆమెను వెతుక్కుంటూ వచ్చి, ఆమెను వెంట బెట్టుకుని ఉదయపురం వేపు వెళ్ళిపోయారు. ఆమె అతన్ని విడిచిపోలేనిదానిలాగా వెళ్ళిపోయింది.

తరవాత వీరవర్మ కల్యాణవర్మను కలుసుకుని, జరిగినదంతా చెప్పి, స్వర్ణకేశికి తన పేరు కల్యాణవర్మ అని చెప్పిన సంగతి కూడా చెప్పాడు.

కల్యాణవర్మ కొంచెంసేపు ఏమీ అనక, తన మిత్రుడి ప్రేమ సఫలం చెయ్య నిశ్చయించాడు. అసలు సంగతి ఏమంటే, కల్యాణవర్మకు స్వర్ణకేశిని వివాహమాడాలన్న ఉద్దేశం ఉండేది. ఆ సంగతి అతను ఎవరికీ చెప్పలేదు. ఇప్పుడు స్వర్ణకేశి తన మిత్రుణ్ణి ప్రేమిస్తున్నదని తెలిసినాక తాను వారి ప్రణయానికి అడ్డు రాదలచలేదు.

"మిత్రమా, నీకూ, స్వర్ణకేశికీ వివాహం జరగటానికి నాచేతనైనదంతా చేస్తాను," అని కల్యాణవర్మ వీరవర్మకు మాట ఇచ్చాడు.



స్వర్ణకేశి తమ రాజభవనానికి తిరిగి పోతూనే, తన అనుభవమంతా చెప్పి, తనను కాపాడిన మాళవరాజకుమారుడు కల్యాణవర్మను తాను వివాహమాడ నిశ్చయించినట్టు తండ్రితో అన్నది. అందుకామె తండ్రి సంతోషంగా ఒప్పుకున్నాడు. ఎందుకంటే, స్వర్ణకేశిని కల్యాణవర్మకిచ్చి పెళ్లి చేసే ఆలోచన వారి తల్లిదండ్రులకు ఏనాటినుంచో ఉన్నది. స్వర్ణకేశి అభిప్రాయం తెలుసుకోకుండా ఆమెకు ఈమాట తండ్రి చెప్పదలచలేదు. ఇప్పుడు ఆమె కూడా అదే కోరుతున్నది గనక ఆమె తండ్రికి పెద్ద బరువు దిగిపోయినట్టు అయింది.



"లేదమ్మా! మాళవ రాజుకు ఒక్కడే కొడుకు, కల్యాణవర్మ. అతనే యువరాజు కూడా!" అన్నాడు తండ్రి.

"మరేమీలేదు. మనిషికీ, పటానికీ కొద్ది తేడా ఉన్నదేమోననిపించింది." అన్నది స్వర్ణకేశి.

"ఉండవచ్చు. నాకూ కూడా ఆ కుర్రవాణ్ణి చూడాలని ఉన్నది. అతన్ని ఒకసారి రావలసిందిగా ఆహ్వానిస్తాను." అన్నాడు స్వర్ణకేశి తండ్రి.

వెంటనే కల్యాణవర్మకు ఉదయపుర రాజు నుంచి ఆహ్వానం అందింది. కల్యాణవర్మ వీరవర్మను పిలిపించి, "నువు ఉదయపురానికి నా బదులు వెళ్ళవలసి ఉంటుంది. సర్ణకేశి తండ్రి వద్ద నువు కల్యాణవర్మ లాగే నటించినా, స్వర్ణకేశితో నిజం చెప్పెయ్యి. నువు నా పేరు చెప్పక మునుపే నిన్ను ప్రేమించింది గనక, నీ ప్రేమ సఫలమవుతుంది. వివాహం అయినాక అసలు సంగతి లోకానికి తెలిసినా పరవాలేదు," అన్నాడు.

వీరవర్మ యువరాజు లాంఛనాలన్నిటితోనూ, సపరివారంగా ఉదయపురం వెళ్ళి, రాజును కలుసుకున్నాడు. కల్యాణవర్మ చిత్రపటానికీ, మనిషికీ తేడా ఉన్న మాట నిజమే. అందుకే స్వర్ణకేశి పటాన్ని గుర్తించలేకపోయింది! తప్పు చిత్రకారు

"నేనూ, మాళవరాజూ ఏనాడో మాట వరసగా అనుకున్నది నీకు కూడా సమ్మతమయింది. కల్యాణవర్మ చిత్తరువు కొంత కాలంగా నా వద్ద ఉన్నది. అది ఇక నీ మందిరంలోనే ఉంచుకోవచ్చు." అంటూ ఆయన కల్యాణవర్మ చిత్తరువు స్వర్ణకేశి కిచ్చాడు.

దాన్ని చూసి స్వర్ణకేశి నిర్ఘాంతపోయింది. ఆ చిత్తరువులోని వ్యక్తి తనను అరణ్యంలో అపాయం నుంచి కాపాడినవాడు కాడు!

ఆమె తన తండ్రిని, "నాన్నగారూ, మాళవరాజుకు ఇద్దరు కొడుకులా?" అని అడిగింది.

డిదే అయి ఉంటుందనుకున్నాడు ఉదయపుర రాజు.

తరవాత వీరవర్మ స్వర్ణకేశి మందిరానికి వెళ్ళాడు.

స్వర్ణకేశి అతనితో, "మా తండ్రిగారు మిమ్మల్ని చూడాలని పిలిపించారు. మా తండ్రిగారూ, మీ తండ్రిగారూ మనకు వివాహం జరగాలని ఏనాడో అనుకున్నారట. నాకా సంగతి తెలియనే తెలియదు," అన్నది.

"మన వివాహం త్వరగా జరుగుతుందని ఆశిస్తున్నాను," అన్నాడు వీరవర్మ ఆమెతో.

స్వర్ణకేశి లేచి వెళ్ళి, కల్యాణవర్మ చిత్తరువు తెచ్చి, వీరవర్మకు చూపుతూ, "ఈ చిత్తరువు ఎవరిదో మీకు తెలుసా?" అని అడిగింది.

వీరవర్మ నిర్ఘాంతపోయి, "ఇది మీ దగ్గిరికి ఎలా వచ్చింది?" అని జీరబోయిన గొంతుతో అడిగాడు.

"నన్ను వివాహమాడగోరిన రాజకుమారుడెవరో దీన్ని మా తండ్రిగారికి పంపాడు," అన్నది స్వర్ణకేశి.

వీరవర్మ ఆవేశంగా, "ఎంత మోసం! కల్యాణవర్మ నాకు సహాయం చేస్తానని మాట యిచ్చి, ఇలా వెన్నులో పొడుస్తాడా?" అనేశాడు.

"మోసం కల్యాణవర్మది కాదు, నీది! మా తండ్రికి నీ గురించి నిజం తెలియకముందే చప్పున వెళ్ళిపో. లేక



పోతే చిక్కులలో పడతావు!'' అన్నది స్వర్ణకేశి.

వీరవర్మ ఎవరికీ చెప్పకుండా వెళ్ళిపోయాడు. తరవాత స్వర్ణకేశికి కల్యాణవర్మకూ వైభవంగా వివాహం జరిగింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, స్వర్ణకేశి వీరవర్మను మొదట వివాహమాడదలచి, తరవాత అతన్ని ఎందుకు విసర్జించింది? అతను రాజకుమారుడు కాడనా? లేక చిత్తరువులో కల్యాణవర్మ ఇంకా అందగాడుగా కనిపించటం వల్లనా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది.'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''కళ్యాణవర్మ ఊహించినట్టు, స్వర్ణకేశి వీరవర్మను రాజకుమారుడని ప్రేమించలేదు. ఆ సంగతి తెలియక మునుపే ప్రేమించింది. ఆమె ప్రేమ మీద విశ్వాసం ఉండబట్టే, కళ్యాణవర్మ వీరవర్మను తన స్థానంలో పంపుతూ, ఆమెతో నిజం చెప్పమని కూడా హెచ్చరించాడు. ఇక స్వర్ణకేశి కల్యాణవర్మ చిత్తరువును చూసిన క్షణంలోనే, తాను చూసినవాడు రాజకుమారుడు కాదని గ్రహించింది. ఆమె రాజకుమారుణ్ణే పెళ్లాడగోరితే వీరవర్మతో మాట్లాడవలసిన పనేలేదు. అతను తన ప్రేమకు పాత్రుడౌనో, కాదో తెలుసుకునేటందుకు ప్రయత్నించి, తాను నిజంగా ఎవరో చెప్పటానికి అతనికి అవకాశం ఇచ్చింది. కాని అతను తాను కల్యాణవర్మ కాదని ఆమెతో అనలేదు, కనీసం కల్యాణవర్మ సలహా కూడా పాటించలేదు, పైపెచ్చు కల్యాణవర్మ తన కోసం చేసిన త్యాగం గ్రహించక పోగా, అతను తనకు ద్రోహం చేశాడని ఆరోపించాడు. అటు తరవాత స్వర్ణకేశి అతన్ని పెళ్ళాడటం అసంభవం!'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# మూడు సూచనలు

మహేంద్ర పురాన్ని ఏలిన మార్తాండవర్మ వద్ద ఉన్న మంత్రులలో మణిమంతుడు హెచ్చు సూక్ష్మబుద్ధి గలవాడని తోచి, రాజు అతన్ని ప్రధానమంత్రిగా నియమించ నిశ్చయించాడు.

అయితే శుక్రుడు అనే మరొక మంత్రి రాణిగారికి దగ్గిర బంధువు. అందుచేత రాణి రాజుతో, "శుక్రుడు మణిమంతుడికి ఏ విధంగా తీసిపోతాడు? అతను చాలా బుద్ధిమంతుడు. అందుచేత శుక్రుణ్ణే ప్రధానమంత్రిగా వెయ్యండి," అన్నది.

"మణిమంతుడి కన్న శుక్రుడు బుద్ధిశాలి అని నిరూపణ అయితే అలాగే చేస్తాను," అన్నాడు రాజు.

ఇంతలో ఒక సమస్య రాజుగారి దాకా వచ్చింది. పురప్రముఖుడైన కోటీశ్వరుడికి పెళ్లి కావలసిన కుమార్తె ఉన్నది. ఆమెను చేసుకుంటామని ముగ్గురు యువకులు ముందుకు వచ్చారు. ముగ్గురూ అన్ని విధాలా యోగ్యులే. పైగా వారు ముగ్గురూ ఒకే గురువు దగ్గిర చదువుకున్నారు; ఒకే వయసూ, అందచందాలూ గలవాళ్ళు.

ఆ ముగ్గురిలో హెచ్చు తగ్గులు నిర్ణయించటం తనకు సాధ్యంకాక, కోటీశ్వరుడు వారి గురువును అడిగాడు. గురువుగారు నోటితో ఫలానావాడు అధికుడు అని చెప్పక, సూచన ప్రాయంగా ముగ్గురు శిష్యులకూ మూడు వస్తువులు ఇచ్చి, వాటిని బట్టి ఎవరు అధికుడో కోటీశ్వరుణ్ణే ఎన్నుకోమన్నాడు. ఆ వస్తువులు ఏమంటే, మట్టీ, ధాన్యపు గింజలూ, నీరూనూ.

ఈ సూచనలను బట్టి, ఆ యువకులలో తన కుమార్తెను మట్టి తీసుకున్న వాడికి ఇయ్యాలో, గింజలు తీసుకున్న వాడికి ఇయ్యాలో, నీరు తీసుకున్నవాడికి

జి. అనందరావు

ఇయ్యాలో తేల్చుకోలేక, తన సమస్యను కోటీశ్వరుడు రాజసభకు నివేదించాడు.

రాజుగారు యువకులను సభకు పిలిపించి, "మీరు ముగ్గురూ గురువు నుంచి పుచ్చుకున్న వస్తువులలో ఏది శ్రేష్ఠమైనది?" అని వారినే అడిగాడు.

మట్టి పుచ్చుకున్న యువకుడు, "అన్నిటికీ క్షేత్రం మట్టిగదా? అది లేనప్పుడు బీజమూ, నీరూ నిరుపయోగం గనక మట్టే శ్రేష్ఠమైనది," అన్నాడు.

గింజలు తీసుకున్న యువకుడు, "ప్రాణికి బీజం ప్రధానం. వట్టి మట్టి నుంచి ఏమీ ఉత్పత్తి కాదు. అందుచేత గురువుగారు నాకు ఇచ్చిన గింజలే శ్రేష్ఠమైనవి," అన్నాడు.

నీరు తీసుకున్న యువకుడు, "నీరు లేకపోతే క్షేత్రమూ, బీజమూ కూడా వ్యర్థమే. అందుచేత నేను పుచ్చుకున్నదే అన్నిటికన్న శ్రేష్ఠమైనది," అన్నాడు.

రాజు శుక్రుణ్ణి అతని అభిప్రాయం ఏమిటని అడిగాడు.

"నిస్సందేహంగా నీరే అన్నిటికన్న ముఖ్యం," అన్నాడు శుక్రుడు, మూడో యువకుణ్ణి బలపరుస్తూ.

"నువ్వేమంటావు?" అని రాజు మణిమంతుణ్ణి అడిగాడు.

"గురువుగారు ఈ యువకులకు ఇచ్చిన వస్తువులు పరీక్షించకుండా ఏమీ చెప్పలేను," అని మణిమంతుడు నీటిని రుచి చూశాడు. నీరు ఉప్పగా ఉన్నది; అది ఎందుకూ పనికిరాదు. గింజలు వేయించినవి; అవి నాటటానికి పనికిరావు. కాని మట్టి శ్రేష్ఠమైనది!

"గురువుగారు తన శిష్యుల కిచ్చిన వస్తువులలో మట్టి మాత్రమే శ్రేష్ఠమైనది. అది పుచ్చుకున్నవాడే శ్రేష్ఠుడని నిస్సందేహంగా గురువుగారి అభిప్రాయం!" అన్నాడు మణిమంతుడు.

కోటీశ్వరుడి సమస్య తీరిపోయింది! అటు తరవాత రాణి తన బంధువైన శుక్రుణ్ణి గురించి రాజు వద్ద ఏనాడూ ప్రస్తావించలేదు.



# అంతా నటన!

ఒక ఊళ్ళో రామయ్యా, కిష్టయ్యా అని ఇద్దరు నటులు ఉండేవాళ్ళు. రామయ్యకు దేవుడంటే నమ్మకంలేదు. కిష్టయ్యకు నీతి, నిజాయితీ గురించి పట్టింపులేకపోయినా దేవుడంటే చాలా నమ్మకం. అందుచేత అతనికి రామయ్య అంటే కొద్దిపాటి ద్వేషం ఉన్నది.

ఇలా ఉండగా ఏదో పండగకు ఆ ఊళ్ళో నాటకం ఆడారు. అందులో రామయ్య ఒక పరమభక్తుడి వేషమూ, కిష్టయ్య గొప్ప నీతిమంతుడైన పౌరుడి వేషమూ వేశారు. ఇద్దరూ మంచి నటులే మరి.

మర్నాడు రచ్చబండ దగ్గిర రామయ్య ఆ నాటకం గురించి మాట్లాడుతూ, "అసలు దేవు డెక్కడ ఉన్నాడు. అంతా అబద్ధం!" అన్నాడు.

కిష్టయ్య మండిపడి, "దేవుడిలో నమ్మకం లేనివాడివి భక్తుడి వేషం ఎలా వేశావు?" అని రామయ్యను అడిగాడు. అందరూ రామయ్యను చూసి గొల్లున నవ్వారు.

రామయ్య తొణకక, "దాని దేమిటి, కిష్టయ్యా? అంతా నటనేగా? నువ్వు గొప్ప నీతిపరుడి వేషం వెయ్యలేదూ?" అన్నాడు.

ఈసారి అందరూ కిష్టయ్యను చూసి నవ్వారు. —పెంటకోట సోమినాయుడు






# కష్టమైన పని

చిరంజీవి అన్న జ్ఞాని దేశ సంచారం చేస్తూ చంద్రసేన మహారాజు కొలువుకు వెళ్లాడు. ఆ సమయానికి సభలో, రాజు అడిగిన ఒక ప్రశ్న గురించి చర్చ జరుగుతున్నది. ఆ ప్రశ్న ఏమంటే, "ఈ ప్రపంచంలో అన్నిటికన్న కష్టసాధ్యమైన పని ఏమిటి ?"

ఒక్కరొక్కరే లేచి తమకు తోచిన సమాధానాలు చెబుతున్నారు—స్వర్గానికి వెళ్లడమని కొందరూ, అమృతాన్ని సాధించడమని కొందరూ, దేవుణ్ణి చూడడమని కొందరూనూ.

రాజు ఇలాటి సమాధానాలకు విసుక్కుని, "స్వర్గమూ, అమృతమూ, దేవుడూ - వీటి సంగతి మనకు తెలియదు. వాటిని మనం చూడలేదు. మనకు తెలిసి కూడా చేయలేని పని ఏమిటో ఎవరైనా చెప్పండి." అన్నాడు.

మళ్లీ ఒక్కొక్కరే సమాధానాలు ఆరంభించారు - నిజం చెప్పడమనీ, ఏకపత్నీ వ్రతమనీ, మహాదాత కావడమనీ తోచిన సమాధానాలు చెప్పసాగారు.

రాజుకు ఈ సమాధానాలు కూడా రుచించలేదు. అప్పుడు చిరంజీవి లేచి, రాజుకు తనను తాను పరిచయం చేసుకుని, "అన్నింటికన్న కోరికలను జయించటం కష్టసాధ్యమని నా బుద్ధికి తోస్తున్నది," అన్నాడు.

రాజు తల అడ్డంగా ఆడించి, "ఎందుచేత ?" అన్నాడు.

"హరిశ్చంద్రుడు నిజం తప్ప చెప్పలేదు. రాముడు ఏకపత్నీవ్రతం పాటించాడు. శిబీ, దధీచీ, కర్ణుడూ మహాదాతలు. కాని అవి వారి కోరికలకు అనుగుణమైనవి గనక అలా చెయ్యగలిగారు. ఈ ప్రపంచానికి మూలం కోరిక.

"వసుంధర"

మహాత్ములైనా, పాపాత్ములైనా కూడా కోరికకు దాసులే!'' అన్నాడు చిరంజీవి.

రాజు చిరంజీవి వాదనను మెచ్చుకుని, అతనికి కానుకలిచ్చి సత్కరించాడు.

ఆ సభలో ఉండే దుర్జయుడు అనే వాడికి, ముక్కూ, ముఖమూ, తెలియని చిరంజీవిని రాజు మెచ్చుకుని సన్మానించడం నచ్చలేదు. వాడు లేచి నిలబడి, ''ప్రభూ, కోర్కెలను జయించడం కష్టం కాదు. అలా జయించిన మనిషి ఒకడు సమీపారణ్యంలో ఉన్నాడు. తమ సెలవైతే అతన్ని తీసుకు వచ్చి రుజువు చేయగలను,'' అన్నాడు.

''రుజువు చెయ్యగలిగితే మంచి బహుమానం ఉంటుంది. లేని పక్షంలో కారాగారప్రాప్తి!'' అన్నాడు చంద్రసేనుడు.

దుర్జయుడు తనకు తెలిసిన మనిషికి ఋషి వేషం వేసి, ఎలా మసులుకోవాలో చెప్పి, రెండు రోజుల అనంతరం అతన్ని కొలువుకు వెంటబెట్టుకుని వచ్చాడు. అతను ఆ దొంగ ఋషిని రాజుకు చూపుతూ, ''ఇతనే, ప్రభూ, నేను చెప్పిన మనిషి,'' అన్నాడు.

రాజు అతడికి కోరికలున్నదీ, లేనిదీ పరీక్షించమని చిరంజీవిని నియోగించాడు. చిరంజీవి ఆ మనిషికి ఎన్నో ఆశలు చూపించాడు, కాని ఆ దొంగఋషి దేనికీ



లొంగలేదు. ఆ మనిషికి ఏ కోరికా లేనట్లు కనబడింది.

చంద్రసేనుడు చివరకు విసిగిపోయి, ''ఈ రాజ్యానికి నిన్ను రాజును చేస్తాను, ఒప్పుకుంటావా?'' అని అతన్ని అడిగాడు.

''సర్వసంగపరిత్యాగిని. నాకు రాజ్యమెందుకు? సంపదలెందుకు?'' అన్నాడు దొంగఋషి.

చిరంజీవి ఏదో ఆలోచించి, ''మహానుభావా! మీ వంటివారు అరుదు. అయినా రేపు మళ్ళీ సభకు వస్తే, మీకూ కోరికలున్నాయని రుజువు చేయగలను. రాని పక్షంలో మీకు కోరికలున్నట్టే భావించడం జరుగుతుంది,'' అన్నాడు.

చిరంజీవి ఉద్దేశం ఎవరికీ అర్థం కాలేదు. బహిరంగంగా అందరి ఎదటా కోరికలు లేనట్టు నటిస్తున్న ఆ ఋషి, చాటుగా తన కోరికలను బయటపెట్టు కుంటాడని చిరంజీవి అభిప్రాయం అయి ఉండవచ్చునని వాళ్ళు అనుకున్నారు. దొంగఋషి కూడా అలాగే అనుకుని, చాలా జాగ్రత్తగా మసలుకున్నాడు. తాను ఉన్న చోటికి ఎవరు వచ్చినా చిరంజీవే పంపి ఉంటాడనుకుని, రోజంతా జాగరూకతతో ప్రవర్తించాడు.

మర్నాడు దుర్జయుడు దొంగఋషిని వెంటబెట్టుకుని, కొలువుకు వచ్చాడు. చిరంజీవి ఋషిని చూస్తూనే, ''తమకు కోరిక ఉన్నట్టు రుజువు చేస్తానని చెప్పాను గదా, ఎందుకు వచ్చారు?'' అని అడిగాడు.

దొంగఋషి నవ్వి, ''ఎలా చేస్తావో చూద్దామని!'' అన్నాడు.

''అదే మీ కోరిక!'' అన్నాడు చిరంజీవి.

సభ హర్షధ్వానాలతో నిండిపోయింది. సద్దుమణిగాక చిరంజీవి దొంగఋషితో, ''స్వామీ, మీకు కోరిక లేకపోవడమేమిటి? మీకు కోరిక లేదని నిరూపించుకోవడం కోసం అరణ్యం నుంచి రాజసభకు వచ్చారు, ఇంకో రోజు ఆగమంటే ఆగారు. మీకు కోరికలు లేవని నిరూపించుకోవాలన్నది మీ కోరిక కాదా?'' అన్నాడు.

చంద్రసేనుడు దుర్జయుడి కేసి చూసి, ''నువు ఓడిపోయావు. ముందే హెచ్చరించాను గదా. నీకు కారాగారశిక్ష తప్పదు!'' అన్నాడు.

చిరంజీవి రాజు వంక చూసి, ''ప్రభూ, ఇందులో దుర్జయుడి తప్పేమీ లేదు. కోరికలను జయించడం అసాధ్యమని ఇప్పుడేగదా రుజువయింది! నేను చెప్పినది తప్పని నిరూపించాలన్న కోరికతో అతను ఇలా చేశాడు. అతన్ని మన్నించి వదిలిపెట్టవచ్చు.'' అన్నాడు.

చంద్రసేనుడు దుర్జయుణ్ణి మన్నించి, చిరంజీవిని ఇంకా ఘనంగా సన్మానించాడు.





# దుర్వాసుడు

దుర్వాసుడు అంటే ఇల్లులేని వాడని అర్థం. ఈ మహాముని ఇల్లూ, వాకిలీ లేని వాడిలాగే కనబడతాడు.

దుర్వాసుడు అత్రికి, అనసూయకూ శివుడి అంశన జన్మించాడు. ఆ దంపతులకు త్రిమూర్తుల అంశలతో కొడుకులు కలిగారు. బ్రహ్మ అంశన పుట్టినవాడు చంద్రుడు. విష్ణు అంశన పుట్టినవాడు దత్తాత్రేయుడు.

శివుడు త్రిపురాసురులను చంపి, బాణం తీసుకుని వస్తూంటే, ఆ బాణం పిల్లవాడి రూపంలో ఉండటం చూసి, దేవతలు శివుణ్ణి, "ఆ పిల్లవాడెవరు?" అని అడిగారట.

"దుర్వాసుడు!" అని శివుడు చెప్పాడట!

గంధమాదనపర్వతం వద్ద దుర్వాసుడు తపస్సు చేసుకుంటూంటే సాహసికుడు అనే గంధర్వుడు, తిలోత్తమ అనే అప్సరసతో ప్రణయవిహారాలు చేయటం చూసి, తాను కూడా పెళ్ళాడి సంసారం చేయాలన్న కోరిక కలిగింది. ఇదే సమయంలో ఔర్వుడు అనేవాడు తటస్థపడి, తన కూతురు కందళి అనేదాన్ని దుర్వాసుడికి ఇచ్చి పెళ్లి చెయ్యటానికి ఒప్పుకున్నాడు.

దుర్వాసుడు కందళితో కొంతకాలం కాపరం చేశాడు. అయితే దుర్వాసుడిలాగే కందళి కూడా అమిత కోప స్వభావం కలది. ఇద్దరికి పొత్తు కుదరలేదు. దుర్వాసుడు సంసారం మాని తిరిగి తపస్సులోకి దిగిపోయాడు.

పాండవుల పుట్టుకకు దుర్వాసుడు ముఖ్య కారకుడు. ఒకసారి, కుంతి కన్యగా ఉండగా, దుర్వాసుడు కుంతిభోజుడి ఇంటికి వెళ్లి, కుంతి చేసిన సప

ర్యలకు సంతోషించి, ఆమెకు ఒక మంత్రం ఉపదేశించాడు. ఆ మంత్రం సహాయంతో కుంతి సూర్యుణ్ణి ఆవాహన చేసి, అతనికి కర్ణుణ్ణి కన్నది. పెళ్లి అయిన తరవాత, తన భర్త అయిన పాండురాజు అనుమతితో, ఆమె యమ, వాయు, ఇంద్రులకు ధర్మరాజునూ, భీముణ్ణీ, అర్జునుణ్ణీ కన్నది. అదే మంత్రం సహాయంతో మాద్రి నకుల సహదేవులను కన్నది. ఈ విధంగా, దుర్వాసుడు మహాభారత కథకు మూల కారకుడయాడు.

అయితే దుర్వాసుడు ఆ గౌరవం దక్కించుకోలేదు. పాండవులు అరణ్యవాసం చేస్తున్న సమయంలో వారిని పరాభవించాలని దుర్వాసుడు కొన్ని పందలమంది బ్రాహ్మణులను వెంట బెట్టుకుని, పాండవులు వున్న చోటుకు వచ్చాడు.

ధర్మరాజు వారినందరినీ భోజనానికి ఆహ్వానించాడు. అయితే అప్పటికే అందరి భోజనాలూ అయిపోయాయి. ద్రౌపది అక్షయపాత్రను కడిగేసింది.

అంతమంది అతిథులకు భోజనం ఎలా పెట్టాలో తెలీక బాధపడుతున్న ద్రౌపదికి కృష్ణుడు వచ్చి, ఆమె కడిగిన అక్షయ పాత్రలో ఒక మెతుకు మిగిలి ఉండటం చూసి, దాన్ని తిన్నాడు. వెంటనే స్నానం చేయబోయిన దుర్వాసుడికీ, అతని వెంట ఉన్న బ్రాహ్మణులకూ పొట్టలు ఉబ్బిపోయాయి. వారు భోజనమంటే బెదిరి పోయి, అటు నుంచి అటే వెళ్లిపోయారు.

దుర్వాసుడికి మరో పరాభవం ఇంద్రుడి వల్ల కలిగింది. అతను సంచారం చేస్తూండగా ఒక విద్యాధరి అతనికి ఒక పూలమాల ఇచ్చింది. దుర్వాసుడు ఆ దండను తీసుకుని ఇంద్రలోకానికి వెళ్ళి, ఇంద్రుడికి దాన్ని ఇచ్చాడు. ఇంద్రుడు ఆ దండను తన ఏనుగు, ఐరావతానికి ఇచ్చాడు. ఐరావతం దాన్ని విసిరి అవతల పారేసింది. దుర్వాసుడికి తీరని అవమానం అయింది.





# శ్యమంతకమణి

సత్రాజిత్తు అనే రాజు సూర్యుణ్ణి మెప్పించి, అతని వల్ల శ్యమంతకం అనే మణిని బహుమతిగా పొందాడు. అది రోజూ ఎనిమిది బారువుల బంగారం ఇచ్చేదట.



ఒకసారి కృష్ణుడు సత్రాజిత్తును శ్యమంతకమణిని గురించి అడిగి, దానిని తనకియ్యమన్నాడు. కాని సత్రాజిత్తు దానిని కృష్ణుడికి ఇయ్య నిరాకరించాడు.



కొంతకాలానికి సత్రాజిత్తు తమ్ముడైన ప్రసేనుడు ఆ మణిని ధరించి వేటకు బయులుదేరాడు.



అరణ్యంలో ప్రసేనుడు వేటాడుతూండగా ఒక సింహం అతన్ని చంపి, మణిని సంగ్రహించుకుపోయింది.



అదే సమయంలో జాంబవంతుడు సింహాన్ని ఎదుర్కొని, దాన్ని చంపి, శ్యమంతకమణిని తీసుకుపోయి, తన కుమార్తె అయిన జాంబవతికి ఇచ్చాడు.



శ్యమంతకమణిని కృష్ణుడే కాజేసి ఉంటాడన్న అపవాదు పుట్టింది. దాన్ని పోగొట్టుకోవటానికి కృష్ణుడు ప్రసేనుడి జాడ వెతుకుతూ అరణ్యం మీదుగా జాంబవంతుడి గుహకు వచ్చి, అతనితో యుద్ధం చేసి ఓడించాడు.



జాంబవంతుడు కృష్ణుడికి శ్యమంతక మణిని ఇస్తూ, తన కూతురు జాంబవతిని కూడా భార్యగా ఇచ్చాడు. కృష్ణుడి అష్టభార్యలలో ఆమె ఒకతె.



కృష్ణుడు శ్యమంతకమణిని తీసుకుపోయి సత్రాజిత్తుకు ఇచ్చాడు. సత్రాజిత్తు సంతోషించి, కృష్ణుడికి తన కూతురు సత్యభామను ఇచ్చి పెళ్ళి చేశాడు.



న్యాయంగా సత్యభామను పెళ్ళాడవలసి ఉండినవాడు శతధన్వుడు. కృతవర్మా, అక్రూరుడూ అనే యాదవులు శతధన్వుణ్ణి రెచ్చగొట్టి, సత్రాజిత్తును చంపమన్నారు.



వారి ప్రేరణతో శతధన్వుడు, సత్రాజిత్తు నిద్రపోతూండగా వెళ్ళి, అతన్ని హత్య చేశాడు.



సత్యభామ తన తండ్రి మరణానికి దుఃఖిస్తూ, కృష్ణుణ్ణి శతధన్వుడి మీదికి యుద్ధానికి పంపింది. యుద్ధంలో శతధన్వుడు చచ్చాడు.



అయితే శ్యమంతకమణి శతధన్వుడి వద్ద లేదు. అది అతని కొడుకు భోజుడి వద్దకు చేరింది. అక్రూరుడు దాన్ని తెచ్చి కృష్ణుడికి చేర్చాడు. శ్యమంతకమణి వల్ల కలిగిన హింసకు పరిహారంగా అక్రూరుడు యజ్ఞాలు చేశాడు.



# భద్రాయువు

దశార్ణదేశపు రాజు వజ్రబాహుడు. అతనికి సుమతి అనే భార్యతోబాటు ఇంకా ఇతర భార్యలు ఉండేవారు. వారిలో సుమతి గర్భవతి అయింది. అది చూసి అసూయ చెంది, వజ్రబాహుడి ఇతర భార్యలు ఆమెకు మందు పెట్టారు.

కాలక్రమాన సుమతి కొడుకును కన్నది. కాని తల్లి కొడుకులు ఇద్దరూ మందు మూలంగా రోగిష్ఠివాళ్ళు అయారు. వాళ్ళు ఎప్పుడూ మూలుగుతూ, ఏడుస్తూ ఉంటే వజ్రబాహువు సహించలేక, వారిని అరణ్యంలో దిగవిడిపించాడు.

అక్కడి నుంచి సుమతి, తన కొడుకును ఎత్తుకుని, వైశ్యపురం చేరింది. అక్కడి వైశ్యుడి భార్య ఆ తల్లి కొడుకులను ఆదరించి, తన ఇంట ఉంచుకున్నది. కాని ఒకనాడు సుమతి కొడుకు చచ్చిపోయాడు. ఆమె పుత్ర శోకంతో ఏడుస్తూంటే ఋషభయోగి వచ్చి, ఆమెకు తత్వం ఉపదేశించి, శోకం పోగొట్ట జూచాడు. కాని ఆమె ఏడవటం మానలేదు. అప్పుడా యోగి చచ్చిపోయిన కుర్రవాడి మీద ఏదో భస్మం చల్లి బతికించి, భద్రాయువు అని పేరు పెట్టాడు.

కొంతకాలం గడిచాక వెనకటి ఋషభయోగి వచ్చి, భద్రాయువుకు చంద్రహాసం అనే ఖడ్గాన్నీ, శంఖాన్నీ ఇచ్చాడు.

మరికొంత కాలం గడిచింది. మగధ రాజు వజ్రబాహువును ఓడించి, దశార్ణ దేశాన్ని ఆక్రమించుకున్నాడు. వెంటనే భద్రాయువు తన ఖడ్గాన్నీ, శంఖాన్నీ తీసుకుని, రథం ఎక్కి, తన మిత్రుడైన వైశ్య కుమారుణ్ణి సారథిగా పెట్టుకుని, మగధ సేనల మీదికి ఒంటిగా వెళ్ళి, మగధ రాజును జయించి, దశార్ణ దేశాన్ని తిరిగి తన తండ్రి పరంచేసి, తాను వైశ్యపురానికి

తిరిగి వచ్చాడు. అయితే కుర్రవాడు తన కొడుకేనన్న సంగతి వజ్రబాహుడికి తెలియదు.

ఋషభయోగి భద్రాయువు జీవితంలో మరొక పాత్ర కూడా వహించాడు. అతను చంద్రాంగదు డనే రాజు వద్దకు వెళ్ళి, భద్రాయువు సంగతి అంతా చెప్పి, "నీ కూతురు కీర్తిమాలిని అతని కిచ్చి పెళ్ళి చెయ్యి." అని చెప్పాడు.

చంద్రాంగదుడు భద్రాయువుకు లగ్న పత్రిక పంపి పిలిపించి, అతనికి కుమార్తె నిచ్చి పెళ్ళి చేస్తూ, ఆ పెళ్ళికి చాలామంది రాజులను ఆహ్వానించాడు. అలా వచ్చిన వారిలో వజ్రబాహుడు కూడా ఉన్నాడు. ఆయన పెళ్ళికొడుకును చూసి, ఆ కుర్రవాడే తనకు రాజ్యం ఇప్పించినవాడని గుర్తుపట్టి, "ఇతను ఎవరి కొడుకు?" అని అడిగాడు.

"నీ కొడుకే!" అని చెప్పి, చంద్రాంగదుడు వజ్రబాహుడికి తనకు తెలిసినదంతా చెప్పాడు. వజ్రబాహువు తాను చేసిన దానికి పశ్చాత్తాపపడి, సుమతినీ, భద్రాయువునూ తన దేశానికి తీసుకుపోయి, భద్రాయువుకు పట్టంకట్టాడు.

రాజు అయాక భద్రాయువు ఒక చిత్రమైన పరీక్షకు గురి అయాడు. ఒకనాడు అతను తన భార్యతో వనవిహారం చేసి, ఒక చెట్టు నీడన విశ్రమించి ఉండగా, ఒక బ్రాహ్మణుడు, "రక్షించు! రక్షించు!" అంటూ వచ్చి, ఒక పులి తన భార్యను ఈడ్చుకుపోతూ ఉండటం చూపించాడు. భద్రాయువు పులిని ఎన్ని బాణాలతో కొట్టి కూడా ప్రయోజనం లేకపోయింది.

"నీ శంఖమూ, ఖడ్గమూ ఏవి? ఇంత చేతగానివాడివి రాజువా?" అని బ్రాహ్మణుడు అతన్ని నిందించాడు.

భద్రాయువు అతనితో, "నా భార్యా, నా శరీరమూ, నా రాజ్యమూ వీటిలో ఏది కావాలంటే అది తీసుకో." అన్నాడు.

"నువు గొప్ప ధైర్యశాలివి! నిన్ను పరీక్షించటానికి మాయ కల్పించాను!" అని బ్రాహ్మణుడు వెళ్ళిపోయాడు.



# సూక్ష్మం

ఒక రాజూ, మంత్రీ మారువేషాలలో తమ రాజ్యమంతా పర్యటింమతూ, ఏ మూల ఎవరికి ఎలాటి సహాయం కావలసినా చేస్తూ ఉండేవారు. ఒకసారి వారు రామాపురం అనే గ్రామంలో రామయ్య అనే ఆయన ఇంటికి వెళ్ళి, "ప్రయాణీకులం! మాకు భోజనసౌకర్యం చెయ్య గలరా?" అని అడిగారు.

"మీరు ఎంతమంది?" అని రామయ్య, ఇద్దరే అని తెలుసుకుని భోజనం పెట్టుతానని మాట ఇచ్చి, ఆ ఇద్దరికీ ఆ రాత్రి చక్కని విందుభోజనం పెట్టించాడు.

తరవాత రాజూ, మంత్రీ కృష్ణాపురంలో కృష్ణయ్య అనే ఆయన ఇంటికి పోయి, రామయ్యను అడిగినట్టే, "భోజన సదుపాయం చేయుగలరా?" అని అడిగారు.

"తప్పక చేస్తాను. మీరెంతమంది?" అని కృష్ణయ్య అడిగాడు. వారిద్దరేనని తెలిసి, ఇద్దరికీ మంచి భోజనమే పెట్టి తృప్తిపరిచాడు.

రాజధానికి చేరగానే రాజు మంత్రితో, "కృష్ణాపురంలో కృష్ణయ్యకు జీవితాంతం నెలకు పందవరహాల భరణం ఏర్పాటు చేయండి," అన్నాడు.

దానికి మంత్రి, "రామాపురంలో రామయ్య కూడా మనకు ఆతిథ్యం ఇచ్చాడు గదా, అతన్ని ఎందుకు మినహాయించారు?" అని అడిగాడు.

"రామయ్య మనం ఇద్దరమేనని తెలిసిన మీదట భోజనం పెట్టటానికి ఒప్పుకున్నాడు. ఇరవైమంది మంటే ఏమని ఉండునో! కృష్ణయ్య భోజనం పెట్టటానికి ఒప్పుకుని వంట ప్రయత్నం కోసం ఎందరని అడిగాడు. అతని అతిథిసత్కారం గొప్పది," అన్నాడు రాజు.

—పుల్లగూర సుబ్రహ్మణ్యం





# శకునఫలితాలు

షావుకారు రామప్పకు శకునాలంటే తగని నమ్మకం. ఆయన ఒక సంత రోజున పట్నం వెళ్ళాలనుకుని, బాగా చీకటి ఉండగానే లేచి, తలుపు తీశాడో లేదో, పక్కింటి వెంకయ్యగారి పెంపుడు పిల్లి ఎదురుగా కనిపించింది.

"లేస్తూనే దరిద్రపు పిల్లి మొహం చూశాను. ఎన్ని అనర్థాలు కలుగుతాయో, ఏమిటో ?" అని విసుక్కుంటూ లోపలికి వెళ్ళి, మళ్ళీ పడుకున్నాడు రామప్ప. ఆ విసుగులో రామప్ప తలుపువెయ్యటం మరిచినట్టున్నాడు. ఒక దొంగవెధవ అటుగా వచ్చి మెల్లగా గదిలోకి జొరిపడి, రామప్ప తల వైపున ఉన్న గల్లాపెట్టె తీసుకున్నాడు.

ఆ అలికిడికి రామప్ప లేచి, దొంగను చూసి, "దొంగ, దొంగ!" అని కేకలు పెట్టుతూ, దొంగను పట్టుకో బోయాడు. దొంగ గల్లా పెట్టెతో రామప్ప నెత్తిన ఒక్కటి పెట్టి, కనబడకుండా చీకట్లోకి పారిపోయాడు.

గల్లాపెట్టె పోయింది. లేస్తూనే పిల్లి మొహం చూడటం వల్లనే అలా జరిగిందని పిల్లిని తిట్టుకుని, దొంగతనంగురించి కొత్వాలకు ఫిర్యాదు చేతామని, రామప్ప పట్నం బయలుదేరాడు.

ఆ కొత్వాలు మరెవరో కాదు, రామప్ప చెల్లెలి మొగుడే, పేరు భీమరాజు. రామప్ప చేసే వ్యాపారానికి వడ్డీలేకుండా డబ్బు అరువిచ్చినది కూడా ఈ భీమరాజే. భీమరాజు తన బాకీ తీర్చమని ఎన్నిసార్లు అడిగినా, "అదుగో, ఇదుగో!" అని రామప్ప వాయిదాలు వేస్తూ వస్తున్నాడు.

అందుకని రామప్ప అతికేలాగా భీమరాజుకు దొంగతనం గురించి చెప్పి, "చూడు, బావా! ఆ పెట్టెలో ఉన్న

గుంటక సాంబిరెడ్డి

డబ్బు నీకు ఇద్దామని సిద్ధం చేసినదే! కాస్త శ్రమపడి, ప్రయత్నించి, ఆ దొంగను పట్టుకున్నావే నీ బాకీ చెల్లిపోతుంది. లేక పోతే నీ డబ్బు పోగుకావటానికి నాకు మళ్ళీ ఇంతకాలమూ పట్టుతుంది గద! అసలు ఇదంతా ఆ మాయదారి పిల్లి మూలాన వచ్చింది,'' అన్నాడు.

భీమరాజు రామప్ప చెప్పినదంతా విని, ''దొంగను పట్టటానికి గట్టి ప్రయత్నం చేస్తామనుకో! కాని, పిల్లికీ, దొంగతనానికీ ఏమిటి సంబంధం? నేనూ ఈ రోజు లేస్తూనే పిల్లి మొహం చూశాను. నా ఇంట్లో దొంగతనం జరిగిందా? ముందు ఇంటికి వెళ్ళి భోజనం చేసిరా. నీ చెల్లెలు నిన్ను చూసి చాలా రోజులయిందని తెగ అనుకుంటున్నది,'' అని, రామప్పను తన ఇంటికి పంపించాడు.

రామప్ప భోజనం చేసి, చెల్లెలితో కబుర్లు చెప్పి, కచ్చేరీకి తిరిగి వచ్చేలోగా రక్షకభటులు సంతలో పట్టుబడిన ఒక దొంగను తీసుకు వచ్చారు. సంతలో ఎవరి జేబో కొట్టెయ్యటానికి వాడు ప్రయత్నం చేస్తూ పట్టుబడ్డాడట.

భీమరాజు వాణ్ణి ప్రశ్నిస్తూండగా రామప్ప వచ్చాడు. వస్తూనే అతను దొంగను చూసి, ''వాడే! వాడే, బావా, రాత్రి మనింట్లో దొంగతనం చేసి, నన్ను కొట్టి పారిపోయింది! నిజంగా నువు ఎంత తెలివైనవాడివి, బావా! దొంగతనం గురించి చెప్పి రెండుగంటలు దాట



కుండానే దొంగను పట్టేశావు!'' అని ఉత్సాహంతో అరిచాడు, తన ఫిర్యాదు ఆధారంగానే భీమరాజు దొంగను పట్టుకున్నాడని నమ్మి.

దొంగ కూడా రామప్పను చూస్తూనే గుర్తుపట్టి, అట్టే అబద్ధాలాడితే కొత్వాలుగారు తనకు దేహశుద్ధి చేయించటం తప్ప ప్రయోజనం ఉండదని తెలుసుకుని, దొంగతనం ఒప్పేసుకుంటూ, గల్లాపెట్టె ఎక్కడ దాచినదీ చెప్పేశాడు.

తరవాత వాడు ఇంకా ఇలా అన్నాడు:

''నా జన్మలో ఇప్పటివరకూ దొంగతనం చేసి దొరికిపోలేదు. ఈ రోజు లేస్తూనే పిల్లి మొహం చూశాను. 'పిల్లి మొహం చూశావు. ఇవాళ దొంగతనానికి పోవద్దు,' అని మా ఆడది చెబుతున్నా వినకుండా దొంగతనాలు చేసి దొరికిపోయాను.''

కాని భీమరాజు రామప్పతో, ''లేవగానే పిల్లి మొహం చూడటంవల్ల నాకు లాభమే కలిగింది, బావా. ఇంక వసూలు కాదు అనుకున్న బాకీ ఇవాళ వసూలు చేసుకున్నాను.'' అన్నాడు, రామప్ప బయలుదేరుతూండగా.

పోయిన డబ్బు దొరికిందన్న మాటే గాని అది బాకీ తీర్చటానికే సరిపోయింది. దాన్ని తాను మరి కొంతకాలం వాడుకునే అవకాశంలేకుండా పోయినందుకు ఎంతగానో విచారపడుతూ రామప్ప ఇంటికి చేరుకున్నాడు.

వీధి మొదట్లోనే వెంకయ్య దిగులుపడ్డ మొహంతో ఎదురయ్యాడు.

''ఏం, వెంకయ్యా, అలా దిగులుగా ఉన్నావు?'' అని రామప్ప అడిగాడు.

''ఏం చెప్పను, రామప్పా? నిక్షేపంలా తిరుగుతున్న నా పెంపుడు పిల్లి హఠాత్తుగా చచ్చిపోయింది, బండి కిందపడి! పాపం, ఈ రోజు అది లేస్తూనే ఎవరిమొహం చూసిందో?'' అన్నాడు వెంకయ్య.

ఆ పిల్లి తెల్లవారకముందే తన మొహం చూసిందన్న సంగతి గుర్తువచ్చి, రామప్ప గతుక్కుమన్నాడు.






నాయుడుగారు చాలా సంపాదించాడు. అదంతా ఆయన కష్టార్జితం. అందుచేత ఆ డబ్బు దుబారా కావటం ఆయనకు ఎంత మాత్రమూ ఇష్టం లేదు. ఆయన ఇంటి ఖర్చు ప్రతి దమ్మిడీ కూడా తన చేతి మీదుగానే చేసేవాడు. భార్యకు కూడా డబ్బు ఇచ్చేవాడు కాదు.

ఇలా ఉండగా నాయుడిగారి వంట మనిషి పని మానుకుని, తన కొడుక్కు ఉద్యోగం దొరికిన ఊరు వెళ్ళిపోయింది. నాయుడుగారికి మరో వంట మనిషి అవసరమయింది.

ఎవరో పంపినట్టుగా ఒక నడివయసు ఆడమనిషి వచ్చి, "నా పేరు సావిత్రి. వంటపని చెయ్యటానికి వచ్చాను. మీ పాత వంటమనిషే నన్ను పంపింది," అన్నది.

మనిషి శుచిగానూ, శుభ్రంగానూ ఉన్నది. అందుచేత నాయుడుగారు తృప్తి పడి, "రోజూ మిగిలిపోయే అన్నం నువు తీసుకుపోతావా, పనిమనిషిని తీసుకుపోనిస్తావా?" అని అడిగాడు.

సావిత్రి నవ్వి, "నేను వంట చేస్తే అన్నం మిగిలే ప్రసక్తి ఉండదు. ఎంత మందికైనా తూచినట్టు వంట చెయ్యగలను," అన్నది.

ఆమె పొదుపు నాయుడుగారికి చాలా తృప్తిగా ఉండటంచేత, ఆయన సావిత్రితో, "ఈ పూట వంట చెయ్యి. రేపటినుంచీ పనిలో చేరుదువుగాని," అని సావిత్రిని తన భార్యకు అప్పజెప్పి, తాను పని మీద వెళ్ళిపోయాడు.

"ఉద్యోగం ఇచ్చేవరకే ఆయన ప్రమేయం! ఆపైన నాదే అధికారం. ఇంటిగుట్టు బయట పెట్టావో నీ ఉద్యోగం ఊడుతుంది!" అన్నది నాయుడుగారి భార్య సావిత్రితో.

మాచిరాజు కామేశ్వరరావు

ఆ ఇంటి గుట్టు ఏమిటో సావిత్రికి త్వరలోనే తెలిసిపోయింది. నాయుడుగారంటే ఇంటిల్లిపాదికీ హడలు! ఆయన తన సుఖం కూడా లక్ష్య పెట్టకుండా కష్టపడి డబ్బు సంపాదిస్తాడు. ఇంట్లో ఎవరికీ ఏ లోటూ రానియ్యడు. అయినా ఇంట్లో ఎవరికీ ఆయన అంటే ప్రేమ లేదు. అందుకు కారణం, ఆయన ఎవరినీ నమ్మి ఒక్క పైసా ఇయ్యడు. ఆయన లోభి అని ఇంట్లోవాళ్ళ అభిప్రాయం. తండ్రి ఇంటి నుంచి అవగలికి పోగానే పిల్లలు చిరుతిళ్ళకనీ, చిన్న చిన్న వస్తువులకనీ తల్లిని డబ్బు అడుగుతారు. వాళ్ళ కోసం ఆవిడ ఇంటికి తెచ్చిన సరుకులు చాటుగా అమ్మి, ఆ డబ్బు తన దగ్గిర ఉంచుకునేది. ఇందుకోసం ఆమె నాయుడుగారి చేత ఇంటి అవసరాలకు మించి సరుకులు కొనిపించేది; అదనపు సరుకులు ఇంట్లో పనిమనిషి చేత బయట అమ్మించేది.

ఈ రహస్యం తెలుసుకున్న సావిత్రి ఉండబట్టలేక నాయుడుగారి భార్యతో, "అవసరానికి రెట్టింపు సరుకులు కొనిపిస్తున్నారు గదా, బాబుగారికి ఈ విషయం తెలిస్తే నేనే దుబారా చేస్తున్నాననుకుంటారేమో?" అన్నది.

"నీకా భయం అక్కర్లేదు. నాయుడుగారు ఖర్చు పెట్టేశాక, ఆ ఖర్చు గురించి మళ్ళీ ఆలోచించరు!" అన్నది నాయుడుగారి భార్య.



కాని సావిత్రికి ఇంటి పరిస్థితి ఏమీ నచ్చలేదు. ఇంటి మనుషులు ఇంటి యజమానిని పరాయిమనిషిగా చూడటం ఆమె సహించలేక పోయింది!

ఒక రోజు ఎందుకో పనిమనిషి రాలేదు. నాయుడుగారి భార్య ఆ రోజే తెచ్చిన నాలుగు వీశెల నెయ్యిలో సగం ఒక గిన్నెలో పోసి సావిత్రికి ఇచ్చి, పెరటి దోవన వెళ్ళి నెయ్యి అమ్మి డబ్బు తీసుకురమ్మన్నది.

సావిత్రి నెయ్యి అమ్మి, డబ్బూ, గిన్నె తీసుకుని తల వాకిలికుండా ఇంట్లోకి వచ్చింది. ముందు గదిలో నాయుడుగా రుంటాడని ఆమెకు తెలుసు. ఆమె నెయ్యి అమ్మగా వచ్చిన డబ్బు నుంచి ఒక నాణెం తీసి నాయుడుగారి కిచ్చి, "ఇది సత్తు నాణెం కాదు గదా, బాబూ? చూడండి!" అన్నది.

నాయుడుగారు నాణాన్ని మోగించి చూసి, "ఇది చెల్లే నాణెమే! ఇంతకూ ఇది నీ దగ్గిరికి ఎలావచ్చింది?" అన్నాడు.

"నెయ్యి అమ్మగా కొట్టువాడు ఇచ్చాడు!" అని, నోరు జారినట్టు నాలుక కరుచుకున్నది సావిత్రి.

"నెయ్యి అమ్మడం ఏమిటి?" అని నాయుడుగారు అయోమయంగా అడిగాడు.

సావిత్రి భయం అభినయిస్తూ జరిగినది చెప్పి, "ఇది రోజూ జరుగుతున్నదే గదా!" అన్నది.



నాయుడుగారు ఉగ్రుడైపోయి. భార్యను పిలిచి, నానా చివాట్లూ పెట్టాడు. నాయుడుగారి భార్య భర్తకేమీ జవాబు చెప్పలేక, సావిత్రిని మింగేసేలా చూసింది.

"జవాబు చెప్పవేం?" అంటూ నాయుడుగారు భార్యమీద చేయెత్తాడు.

"ఆగండి, బాబుగారూ! అసలు తప్పు మీదే! అమ్మగారికి తరచు డబ్బు ఇస్తూ ఉంటే, ఈ విధంగా చేసేవారా? ఇంట్లో ఆడవాళ్ళకు ఖర్చులేవీ ఉండవనుకో కండి. పిల్లలు చిరుతిళ్ళకు డబ్బు అడుగుతారు! తలవని తలంపుగా ఇంటికి కావలసిన వస్తువేదో వీధిలో అమ్మకానికి వస్తుంది. ప్రతిదానికీ భర్తను అడగా లంటే వీలుపడకపోవచ్చు, వీలుపడినా తల నొప్పిగా ఉండవచ్చు. కాని అమ్మ గారు చేసిన పని కూడా మంచిది కాదు. ఆమె చేసిన పనివల్ల పిల్లల దగ్గిరా, పని వాళ్ళ దగ్గిరా చులకనైపోయారు. ఒకరి దాకా ఎందుకు? నా భర్త నాకు అప్పు డప్పుడూ కొంత డబ్బు ఇస్తూ వచ్చినట్ట యితే, నాకు ఈ వంటలక్క పని తప్పేది. ఈ ఇంటిగుట్టు బయట పెట్టినందుకు నా ఉద్యోగం ఊడిందని తెలుసు." అంటూ సావిత్రి డబ్బులు నాయుడుగారి కిచ్చి, వెను తిరిగి వెళ్ళిపోబోయింది.

కాని ఆమె వాకిలి దాటేలోపల, "సావిత్రీ, రేపు మామూలు వేళకు వచ్చెయ్యి." అంటూ భార్యాభర్త లిద్దరూ కేక పెట్టారు. వాళ్ళలో మార్పు వచ్చి నందుకు సంతోషిస్తూ సావిత్రి, మంచంలో పడి ఉన్న తన భర్తకోసం బత్తాయిపళ్ళు ఆపీ కొని ఇంటికి వెళ్ళింది.

ఆమె పండు ఒకటి ఒలిచి భర్త కిస్తూ, "నువు కాళ్ళూ, చేతులూ పడిపోయి మంచాన పడినా ఇవాళ చక్కగా ఉపయోగ పడ్డావు. నీ పేరు చెప్పి ఒక భార్యా భర్తల మధ్య అడ్డుగోడ తొల గించాను." అన్నది.

సావిత్రి జరిగినదంతా చెప్పగా, ఆమె భర్త కూడా ఆనందించాడు.



# రాజు అసమర్థుడా?

ఒక రాజు తన మంత్రితో, "నా చిన్న కొడుకు ఎవరితోనూ కలవడు, ఎవరితోనూ మాట్లాడడు. ఎప్పుడూ ఒంటరిగా ఉంటాడు. నాకు వాణ్ణి గురించి బెంగగా ఉన్నది," అన్నాడు.

మంత్రి చిరునవ్వు నవ్వి, "మహారాజా, గుంపులుగా తిరిగే కాకులు జ్ఞానంలేనివి. జ్ఞానం గల గద్దలు ఎప్పుడూ ఒంటరిగానే విహరిస్తాయి," అన్నాడు.

తరవాత కొన్నాళ్ళకు రాజు మంత్రితో, "నా పెద్ద కొడుకు యువరాజు అల్పమైనవాళ్ళనూ చేర్చి, వాళ్ళతో కాలక్షేపం చేస్తూంటాడు. నాకు వాణ్ణి గురించి బెంగగా ఉన్నది," అన్నాడు.

మంత్రి చిరునవ్వు నవ్వి, "బలమైన రాబందులు దోమలతో స్నేహం చేసి, ఆహారం ఎక్కడ ఉన్నదీ ఆ దోమల సహాయంతో తెలుసుకుని, హాయిగా బతుకుతుంటాయి," అన్నాడు.

రాజు ఒక క్షణం ఆలోచించి, "నా చిన్న కొడుకు మంచివాడే, పెద్ద కొడుకూ మంచివాడే! వాళ్ళను గురించి బెంగపడే నేనే అసమర్థుడినన్నమాట!" అన్నాడు.

మంత్రి మాట్లాడలేదు.

—ఎస్. అగ్రవాల్





# మహత్తర మూలిక

శ్రీగుప్తుడు పది గ్రామాలకు జమీందారు. ఆయన గ్రామాల అభివృద్ధి గురించి అస్తమానమూ ఏవో పథకాలు ఆలోచిస్తూ, దీక్షగా వాటిని అమలుపరచి సత్ఫలితాలు కలిగితే సంతోషించేవాడు. అతనికి చేతికి వచ్చిన కొడుకు జయగుప్తుడు, తండ్రికి సలహాదారుగా ఉంటూండేవాడు.

శ్రీగుప్తుడి పాలనా సామర్థ్యం గురించి ఆ దేశపు రాజు విని, ముచ్చటపడి, అతన్ని తన దివాణానికి పిలిపించుకున్నాడు. వెళ్ళే ముందు శ్రీగుప్తుడు తన కొడుకుతో, "రాజుగారు రమ్మన్నప్పుడు వెళ్ళకపోతే బాగుండదు. నేను లేని లోటు ఏ మాత్రం రానియ్యక, నీ విధులు నువ్వు జాగ్రత్తగా నిర్వర్తించు. అందులో నీకు ఎటువంటి ఇబ్బంది కలిగినా, నాకు వెంటనే కబురు పంపు, నేను వచ్చేస్తాను," అన్నాడు.

రాజుగారు శ్రీగుప్తుడి నుంచి పరిపాలనా రహస్యాలు అనేకం తెలుసుకున్నాడు. రోజూ శ్రీగుప్తుడి అనుభవాలు వింటూ, రాచకార్యాలు చర్చించుతూ, అతన్ని నెలలతరబడి అతిథిగా ఉంచేసుకున్నాడు.

కాని శ్రీగుప్తుడి ప్రాణాలన్నీ తన గ్రామాల మీదా, వాటి నిర్వహణ మీదా, తన కొడుకు మీదా ఉండిపోయాయి. చివరకు అతను రాజుగారితో తనకు సెలవిప్పించమని అన్నాడు. రాజు అతన్ని ఘనంగా సత్కరించి, రాచమర్యాదలతో సాగనంపాడు.

శ్రీగుప్తుడు తన స్వస్థలం చేరి గ్రహించిన దేమంటే, తాను లేనిలోటు ఏమీ జరగలేదు; తన కొడుకు జయగుప్తుడు జమీందారీ పరిపాలనను అత్యంత సమర్థతతో నిర్వహించాడు. తండ్రి తిరిగి వచ్చిన అనంతరం కూడా జయగుప్తుడు

నిష్ఠల అరుణా శ్రీనివాస్

ఎవరి సలహా లేకుండానే పరిపాలన కొనసాగిస్తూ, తాను చేసినవీ, చేస్తున్నవీ తండ్రికి చెప్పసాగాడు. అందులో శ్రీగుప్తుడు తప్పు ఎంచటానికి ఏమీ ఉండేదికాదు.

శ్రీగుప్తుడి ఆరోగ్యం క్రమంగా క్షీణిస్తున్నట్టు జయగుప్తుడికి అనుమానం కలిగింది. శ్రీగుప్తుడు తనకు ఏమీ బాధలేదన్నాడు. వైద్యులను పిలిపించి చూపిస్తే, శ్రీగుప్తుడిలో వృద్ధాప్యం తాలూకు తొలి లక్షణాలు తప్ప, వేరే జబ్బేమీలేదన్నారు. కాని జయగుప్తుడు తృప్తిపడలేదు. శ్రీగుప్తుడికన్న చాలా వృద్ధులు పిడిరాళ్లలా ఉన్నారు. శ్రీగుప్తుడు వ్యాధిగ్రస్తుడనటానికి సందేహం ఎంత మాత్రమూలేదు.

ఏం చెయ్యటానికీ పాలుపోక, జయగుప్తుడు తన తండ్రి వ్యాధి నయంచేసిన వారికి వెయ్యి బంగారు కాసులు బహుమానం ఇస్తానని దండోరా వేయించాడు.

ఈ ప్రకటన విని ఒక యువకుడు వచ్చి, శ్రీగుప్తుణ్ణి పరీక్షచేసి, "ఇది విచిత్రమైన వ్యాధి! దీని చికిత్సకు పనికివచ్చే మూలిక హిమాలయాలలో మాత్రమే పెరుగుతుంది. దాన్ని రోగి సంతానంలో ఎవరో ఒకరు స్వయంగా పీకి తీసుకు రావాలి," అన్నాడు.

తండ్రి వద్దంటున్నా వినకుండా జయగుప్తుడు హిమాలయాలకు ప్రయాణ



మవుతూ, ఆ యువకుణ్ణి తనతో రమ్మన్నాడు. మూలికను గుర్తించగలవాడు వాడే కద! యువకుడు జయగుప్తుణ్ణి దీర్ఘ ప్రయాణం చేయించి, ఆ మూలిక దొరికే ప్రాంతానికి తీసుకుపోయాడు. అనేక రోజులు శ్రమపడి ఆ ప్రాంతమంతా గాలించారు.

"మనకు కావలసిన మూలిక ఇప్పుడు ఇక్కడ లేదు. ఇంకెక్కడైనా దొరుకుతుందేమో నాకు తెలియదు," అన్నాడు యువకుడు జయగుప్తుడితో.

"అర్థమైన వాళ్ళూ వైద్యం చేస్తామని వస్తే ఇలాగే ఉంటుంది!" అన్నాడు జయగుప్తుడు చిరాకుగా.

చేసేదిలేక ఇద్దరూ ఇంటి ముఖం పట్టారు. వాళ్ళు ఇల్లు చేరేటప్పటికి రెండు మాసాలు పట్టింది. తన తండ్రి వ్యాధి గురించి అనుక్షణమూ బెంగపడు తున్న జయగుప్తుడు ఇంటికి వస్తూనే అయనను చూసి నిర్ఘాంతపోయాడు.

శ్రీగుప్తుడు ఏ జబ్బూ లేకుండా, లేచి తిరుగుతూ, పనులన్నీ చూసుకుంటు న్నాడు. జయగుప్తుడికి తాను పడిన వృథా శ్రమ అంతా మరుపుకువచ్చి, ఆనందం కలిగింది.

యువకుడు అతన్ని ఇవతలికి పిలిచి, "నా బహుమతి నాకు ఇప్పించారంటే నా దారిన నేను పోతాను. ఇప్పటికే చాలా ఆలస్యం జరిగింది," అన్నాడు.

జయగుప్తుడికి ఒళ్ళు మండింది.

"చాల్చాల్లే. ఏదో మూలిక ఉన్నదని నన్ను ఎక్కడో హిమాలయాలకు తీసుకు పోయి, నానా హింసాపెట్టి, చివరకు తొంటచెయ్యి చూపినది చాలక, బహు మానం కూడానా?" అన్నాడతను.

యువకుడు చిరునవ్వు నవ్వి, "ఆ మూలిక మహత్తువల్లనే మీ తండ్రి గారు కోలుకుని, మామూలు మనిషి అయారు! ఆయనను పీడించిన వ్యాధి అధికార వాంఛ. ఆయన రాజుగారి అతిథిగా వెళ్ళినప్పుడు ఆయన మీకిచ్చిన పెత్తనాన్ని తిరిగి మీరు ఆయనకు అప్ప గించలేదు. నేను మూలిక వంక పెట్టి మిమ్మల్ని రెండు మాసాలపాటు దూరంగా తీసుకుపోయాను. ఆ మూలికను మీరే పీకాలని నేను అన్నప్పుడే నా ఎత్తు మీరు గ్రహించి ఉండవలసింది! మీరు వెళ్ళ గానే తిరిగి ఆయన పెత్తనం ఆరంభించి కోలుకున్నారు," అన్నాడు.

"నీ ఎత్తు నేను గ్రహించి ఉంటే?" అన్నాడు జయగుప్తుడు.

"కుండ పగలేసినట్టు ఉన్న విషయం చెప్పేవాణ్ణి. మీకు తిప్పట తప్పేది!" అన్నాడు యువకుడు.

జయగుప్తుడు నిజం గ్రహించి, అతనికి బహుమతి ఇచ్చి పంపేశాడు.






విష్ణువు చెప్పిన సలహా ప్రకారం బ్రహ్మ మొదలుగా గల వారందరూ మహాదేవిని ప్రార్థించారు. ఆమె ప్రత్యక్షమయింది. దేవతలు ఆమెను స్తుతించి, "దేవీ, కంసుడు మొదలుగా గల దుష్టులవల్ల కలిగిన భారాన్ని సహించలేక భూదేవి నిన్ను శరణు వేడుతున్నది. హరిహరాదులు సైతం చంపలేని రాక్షసులను నువు సంహరించి ఉన్నావు. అందుచేత ఆమె భారం తీర్చు." అన్నారు.

"తల్లీ, శక్తి సహాయం లేకుండా ఎవరు మాత్రం ఏం చెయ్యగలరు? బ్రహ్మకు సరస్వతి, విష్ణువుకు లక్ష్మి, శివుడికి పార్వతి ఉండబట్టే వారు తమ తమ విధులు సమర్థతతో నిర్వర్తించగలుగుతున్నారు. లేకపోతే వారివల్ల ఏమైనా అవుతుందా?" అన్నాడు ఇంద్రుడు.

"నీ సహాయం లేకపోతే మేం త్రిమూర్తులం శక్తిహీనులమే. ఎవరి సహాయమూ లేకుండా అన్నిటికీ సమర్థురాలివి నువు ఒకతెవే!" అన్నాడు విష్ణువు.

ఈ ప్రశంసలతో తృప్తిపడి జగదంబ, "ఇంతకూ నా వల్ల మీకు ఎలాటి సహాయం కావాలి?" అని అడిగింది.

"తల్లీ, రాజులందరూ పాపాత్ములై క్షోభపెట్టుతూ ఉంటే భూదేవి భరించలేక ఏడుస్తున్నది, చూడు! ఆమె భారం తీరాలని మేమంతా కూడా కోరుతున్నాం. నువు పూర్వం, దానవ బలాల అంద

**12. కంసుడు**



చూసుకుని విజృంభించిన మహిషాసురుడి మదం అణచావు. శుంభ, నిశుంభులను నిర్మూలించావు. రక్తబీజుణ్ణి మట్టుబెట్టావు. చండముండాది రాక్షసులూ, ధూమ్రలోచనుడూ, దుర్ముఖుడూ, దుస్సహుడూ, కరాళుడూ అందరూ నీ చేత చచ్చారు. భూభారం తీర్చి మమ్మల్ని అనుగ్రహించు,'' అన్నారు దేవతలు.

ఆ మాటలకు మహాదేవి నవ్వి, ''జరాసంధుడు మొదలైన దుర్మార్గులను నిర్మూలించాలన్న నిర్ణయం ముందే చేసుకున్నాను. దేవతలంతా మీమీ అంశలతో భూమిపైన జన్మించండి. కశ్యపుడు యాదవకులంలో వసుదేవుడై పుట్టుతాడు. భృగుడి శాపం పొందిన విష్ణువు అతనికి కొడుకుగా పుట్టుతాడు. నేను నందుడి కూతురుగా పుట్టుతాను. నందుడికీ, యశోదకూ నేను కూతురుగా పుట్టి, చేయవలసిన పనులన్నీ సంతోషంగా నిర్వర్తిస్తాను. నిర్బంధంలో పుట్టిన విష్ణువును గోకులానికి పంపిస్తాను. దేవకి గర్భాన ఉండిన శేషుణ్ణి రోహిణీ గర్భానికి మార్చుతాను. నా శక్తి యుక్తుల సహాయంతో బలరామ కృష్ణులిద్దరూ దుర్మార్గులైన రాక్షసుల నందరినీ ద్వాపరయుగాంతంలో చంపేస్తారు. ఇంద్రుడి అంశన అర్జునుడు రాజులందరినీ చంపుతాడు. యముడి అంశన ధర్మరాజూ, వాయువు అంశన భీముడూ, అశ్వినుల అంశన నకుల సహదేవులూ, వసువు అంశన పుట్టే భీష్ముడూ దుష్టసంహారం చేస్తారు. మిమ్మల్ని సాధనాలుగా పెట్టుకుని, చేయవలసినదంతా నేను చేస్తాను. ఇక మీరు మీ మీ స్థానాలకు తిరిగి వెళ్ళండి.'' అని అంతర్ధానమయింది.

కాళిందీ తీరాన ఎత్తయిన చెట్లతో అందమైన మధువనం ఉండేది. అందులో లవణుడు అనే రాక్షసుడు, పరమ దుర్మార్గుడు, మధువు అనే వాడికొడుకు, ఉండేవాడు. బ్రాహ్మణులను బాధలు పెట్టే ఆ రాక్షసుణ్ణి శత్రుఘ్నుడు అనే

వాడు చంపి, ఆ వనంలో ఒక నగరం నిర్మించాడు. అదే మధురానగరం.

అయితే శత్రుఘ్నుడి వంశం వాళ్ళు దాన్ని ఎక్కువ కాలం పాలించలేదు. మధురానగరం యదువంశపు రాజుల వశమయింది. దాన్ని యయాతి కొడుకు శూరసేనుడు ఏలాడు. వరుణ శాపం పొందిన కశ్యపుడు అతనికి కొడుకై, వసుదేవు డనే పేరుతో పుట్టాడు. అదితి దేవకి అనే పేరుతో పుట్టి వసుదేవుడికి భార్య అయింది. అయితే వసుదేవుడు వైశ్యవృత్తి అవలంబించటం వల్ల, మధు వంశంలో పుట్టిన ఉగ్రసేనుడు మధురా పురాన్ని పాలిస్తూ వచ్చాడు. కంసుడు అతని కొడుకు. దేవకి దేవకుడి కూతురు.

దేవకుడు దేవకిని వసుదేవుడి కిచ్చి పెళ్ళిచేశాడు. పెళ్ళి వేడుకల సందడి మధ్య అకాశవాణి, "ఓ కంసుడా, ఈ దేవకి కొడుకులలో ఎనిమిదోవాడు నిన్ను చంపుతాడు," అని చెప్పింది.

ఈ మాటలకు కంసుడు బెదిరిపోయి, దిగులుపడి, దేవకిని చంపేస్తే తనకు ప్రమాదం తప్పుతుంది గదా అనుకున్నాడు కాని, చెల్లెలుగా సన్మానించ వలసిన ఉత్తమురాలిని చంప వచ్చునా అని అతని అంతరాత్మ బాధపడింది. అయినా తాను చావటం కన్న దేవకిని చంపటం



కొంచెం నయమే గదా అనుకున్నాడు కంసుడు. ఎందుకంటే, ప్రాణం ఉంటే ఏ పాపానికైనా ప్రాయశ్చిత్తం చేసుకో వచ్చు. ఏ పాపం చేసి అయినా ప్రాణం నిలుపుకోవాలి గద!

ఇలా అనుకుని కంసుడు, అందరూ చూస్తుండగానే, కత్తి చేతబట్టి, పెళ్ళి కూతురు జుట్టు ఇంకో చేతపట్టుని, ఆమె తల నరకటానికి సిద్ధపడ్డాడు. ఆమె తనకు చెల్లెలనీ, తనకు ఎటువంటి ద్రోహమూ చేసినది కాదనీ ఆ కఠినాత్ము డికి తోచలేదు.

ఆ క్షణంలో వసుదేవుడు అడ్డుపడక పోతే దేవకి తల తెగి ఉండేదే! ఇంతలో



యాదవ వీరులందరూ ఏకమై, ''ఓరి
దుర్మార్గుడా! ఎంతపనికి ఒడిగట్టావురా?"
అని కంసుడితో పోరుకు సిద్ధపడ్డారు.
కంసుడు దేవకిని విడిచి, వారిని ఎదుర్కో
వలసి వచ్చింది.

వృద్ధులు అశుభమైన కొట్లాటను ఆపి,
కంసుడితో, ''పెళ్లికూతురు! ఉత్తము
రాలు! చెల్లెలు! దాన్ని చంపుతావుట్రా?
ఆ మాట లన్నది నిజంగా ఆకాశవాణి
అనుకున్నావా? ఎవడో అసత్యవాది
వసుదేవుడి ఇల్లు కూల్చాలన్న దుర్బుద్ధి
తోనూ, నీకు అపఖ్యాతి కలిగించాలనీ
గారడీ చేశాడు! బుద్ధిమంతులు ఇలాటి
ఇంద్రజాలాన్ని పాటిస్తారా? కాదూ?
ఆకాశవాణే అన్న దనుకుందాం! జరగ
వలసి ఉన్నదాన్ని నువ్వు తప్పించ
గలవా?'' అన్నారు.

వసుదేవుడు కూడా, ''నీకు వచ్చిన
భయం లేదు. ఇంత మందీ వింటుండగా
ప్రమాణం చేసి చెబుతున్నాను; దేవకికి
పుట్టిన బిడ్డలందరినీ నీ కిస్తాను. వారిని
చంపెయ్యి. ఈ మాట నేను తప్పిన
పక్షంలో నాపూర్వులు నరకానికి పోవాలి!"
అని కంసుడికి మాట ఇచ్చాడు.

వసుదేవుడు సూర్య చంద్రులు తల
కిందైనా ఆడితప్పడని అందరూ కంసుడికి
గట్టిగా చెప్పారు. కంసుడు వసుదేవుడి
మాట పాటించి, తన పట్టువిడిచి పెట్టాడు.
వసుదేవుడు దేవకిని తీసుకుపోయి, తన
ఇంట సుఖంగా ఉన్నాడు.

కొంత కాలానికి దేవకి గర్భవతి అయి,
పండులాటి కొడుకును కన్నది.

వసుదేవుడు దేవకితో, ''ఈ పిల్లవాణ్ణి
చంపటానికి కంసుడి కిస్తాను. నువు
శోకించకు. ప్రారబ్ధం దాటరానిది,''
అన్నాడు.

దానికి దేవకి, ''ప్రారబ్ధానికి విరుగుడు
లేకేం? చేసిన పాపాలు పోయి, స్వర్గం
రాగలందులకు తీర్థయాత్రలు చేయాలని
పెద్దలు చెప్పరా! సత్కర్మలతో పాపం
పరిహారం కావటం లేదా? బ్రహ్మ

హత్యలాటి దానికి కూడా ప్రాయశ్చిత్తం ఉంటుంది గదా? మనువు మొదలైన శాస్త్రకారులు చెప్పినదంతా అబద్ధమేనా? జరిగేది జరిగి తీరుతుందనటంలో వివేకం లేదు. చేసిన యత్నానికి ఫలితం కలగటం స్పష్టంగా చూస్తున్నాం. లేని పక్షంలో వేదాలూ, యజ్ఞాలూ, మహామునులూ, గొప్ప ఔషధాలూ మొదలైనవన్నీ అబద్ధమే గద. ఇప్పుడేదన్నా ఉపాయం ఆలోచించు," అన్నది.

ఈ మాటకు వసుదేవుడు ఒప్పుకోక, "ప్రయత్నం చెయ్యాలన్నది నిజమే. కాని కేవలమూ ప్రయత్నంవల్లనే ఫలం రాదు. దైవవశమైన యత్నమే ఫలిస్తుంది. వర్తమానంలో చేసిన దానికి ప్రాయశ్చిత్తం గాని, ప్రారబ్ధానికి ప్రాయశ్చిత్తం లేదు. సారంలేని ఈ జీవితంలో సత్యం ఒకటే సారమైనది. దాన్ని ఎవరైనా వదులుకుంటారా? సత్యంకోసం కష్టసుఖాలు లక్ష్యపెట్టనివారికే శుభం కలుగుతుంది. అందుచేత ఈ బిడ్డను కంసుడికి ఇయ్యటానికి ఒప్పుకో," అన్నాడు.

ఏడుస్తూ దేవకి తన మొదటి బిడ్డను తన భర్త చేతిలో పెట్టింది. తన మాట నిలబెట్టుకోవటానికి బిడ్డను కంసుడి దగ్గిరికి తీసుకుపోతున్న వసుదేవుణ్ణి చూసి అందరూ మెచ్చుకున్నారు. తడి ఆరని బిడ్డను తెచ్చి తనకు అర్పించిన వసుదేవుణ్ణి కంసుడు కూడా మెచ్చుకుని, "నన్ను చంపేది దేవకి అష్టమగర్భాన పుట్టేవాడు





కదా? నాకు వీడితో పనిలేదు, తీసుకు పోయి నువే పెంచుకో," అన్నాడు.

వసుదేవుడు బిడ్డతో తిరిగి వెళ్ళిపోయాడు.

కంసుడు తాను చేసిన పని గురించి తన మంత్రులకు చెప్పగా వారు కూడా కంసుణ్ణి మెచ్చుకున్నారు.

కంసుడి వద్దకు నారదుడు వచ్చాడు. కంసుడు ఆయనను అర్ఘ్య పాద్యాలతో సత్కరించాడు. నారదుడు కంసుడితో, "ఓయి, పిచ్చివాడా! దేవకి కన్న శిశువును చంపకుండా వదిలేశావే! ఎంత తెలివి తక్కువవాడివి! నిన్ను చంపించటానికి విష్ణువు దేవకి గర్భాన పుట్టేలాగా దేవతలు పథకం వెయ్యటం నేను స్వయంగా విన్నాను." అన్నాడు.

"నాకు చావు అష్టమ గర్భం నుంచి అని ఆకాశవాణి అన్నది. మొదటి గర్భాన్నే చంపటం దేనికి?" అని కంసుడు నారదుణ్ణి అడిగాడు.

"దేవతల మాయలు తెలుసుకోలేకుండా ఉన్నావు. నీకు హాని కలిగించేది దేవకి ఎనిమిదో సంతానమే అయినా, వాడికి మిగిలిన ఏడుగురూ తోడు ఉంటే నీకు మరింత కష్టమా, కాదా?" అన్నాడు నారదుడు.

నారదుడు వెళ్ళిపోయాక కంసుడు దేవకి కన్న బిడ్డను తెప్పించి, రాతికేసి కొట్టి చంపాడు.

నారదుడు దేవకి బిడ్డలను కంసుడిచేత పని పెట్టుకుని చంపించటానికి కారణం ఉన్నది.

స్వాయంభువమన్వంతరంలో మరీచికి ఊర్ణ అనే భార్య యందు అరుగురు కొడుకులు కలిగారు. వాళ్ళు ఒకసారి బ్రహ్మను, తన కూతురినే భార్యగా చేసుకున్నాడని హేళన చేశారు.

బ్రహ్మకు కోపం వచ్చి వాళ్ళను రాక్షస జన్మ ఎత్తమని శపించాడు. ఆ శాపం వల్ల వాళ్ళు కాలనేమికి ఒక జన్మలో కొడుకులుగా పుట్టి, రెండో జన్మలో

హిరణ్యకశిపుడి కొడుకులుగా పుట్టటం జరిగింది.

ఈసారి వాళ్ళు శాపవిమోచనం కోసం బ్రహ్మను గురించి తపస్సు చేశారు. బ్రహ్మ ప్రత్యక్షమై, "అప్పుడేదో కోపం కొద్దీ మిమ్మల్ని శపించాను. వరం కోరండి," అన్నాడు.

ఆ ఆరుగురూ బ్రహ్మతో, "నీకు వరం ఇయ్యాలని ఉంటే, మాకు దేవతల వల్లా, రాక్షసులవల్లా, మానవులవల్లా చావు లేకుండా వరం ఇయ్యి. స్థిరంగా బతుకుతాం," అన్నారు.

బ్రహ్మదేవుడు వారికి అలాగే వరం ఇచ్చాడు.

తన కొడుకులు తనను కాదని బ్రహ్మదేవుడి నుంచి వరాలు పొందినందుకు హిరణ్యకశిపుడు ఆగ్రహించి, వాళ్ళను తన వద్ద నుంచి వెళ్ళగొట్టాడు. అతను తన కొడుకులతో, "మీరు పాతాళానికి పోయి, అస్తమానమూ నిద్రకు వశులై చాలాకాలం ఉండి, అనంతరం దేవకి గర్భాన పుట్టండి. కిందటి జన్మలో మీ తండ్రి అయిన కాలనేమి కంసుడుగా పుట్టి, మిమ్మల్ని పుట్టినవాళ్ళను పుట్టినట్టుగానే చంపేస్తాడు," అన్నాడు.

హిరణ్యకశిపుడి శాపంతో ఆ ఆరుగురూ దేవకిగర్భాన జన్మించి, పుట్టుతూనే కంసుడి చేతిలో చచ్చారు.

దేవకి ఏడవసారి గర్భవతి అయింది. కాని అయిదో మాసంలో ఆమెకు గర్భస్రావం అయిందని పుకారు పుట్టింది. ఈ సంగతి విని, కంసుడు ఎంతో సంతోషించాడు.

నిజంగా జరిగినదేమంటే, యోగమాయ దేవకి గర్భాన్ని రోహిణికి మార్చింది. కొంత కాలానికి గోకులంలో రోహిణి బలరాముణ్ణి కన్నది.

ఎనిమిదోసారి దేవకి గర్భం దాల్చింది. ఈసారి ఆమె గర్భంలో ఉన్నవాడు విష్ణువు. యోగమాయ తానుకూడా ఆ గర్భంలో చేరింది. ఈసారి కంసుడు దేవకీ వసుదేవులను నిర్బంధంలో ఉంచాడు.





# కనిష్కుడి ఔదార్యం

చాలాకాలం కిందట కుషాణవంశస్థుడైన కనిష్కుడు పురుషపురం రాజధానిగా ఉత్తర భారతదేశాన్ని పరిపాలించాడు. ఆయన దైవాంశంతో జన్మించినవాడనే ప్రతీతి ప్రజల్లో వుండేది.

కనిష్కుడు దయాధర్మ గుణాలకే గాక, ధైర్య సాహసాలకు కూడా పేరు పొందినవాడు. అనాడు బలవంతులైన అనేకమంది రాజులను జయించి తనకు సామంతులుగా చేసుకొన్నాడు. అలాంటి వారిలో కన్యాకుబ్జపు రాజు ఒకడు.

కనిష్కుడి పుట్టిన రోజు పండుగకు సామంతరాజులు కానుకలు పంపుతూ వుండటం ఒక ఆచారం. ఒకసారి అతడి పుట్టినరోజు పండుగకు కన్యాకుబ్జరాజు తన కానుకగా ఒక పట్టుగుడ్డ పంపాడు.

తనకు వచ్చిన కానుకలలో యీ పట్టు గుడ్డ కనిష్కుణ్ణి ఎంతగానో ఆకర్షించింది. దీన్ని ఒక అంగరకాగా కుట్టించుకుంటే బావుండు ననుకున్నాడు. దర్జీవాణ్ణి పిలిపించి ఒక్క వారం రోజుల్లో అంగరకా కుట్టుకు రావలసిందని చెప్పాడు.

వారం కాదు, రెండు వారాలు గడిచినా దర్జీ అంగరకా తయారుచేసి తేలేదు. కనిష్కుడు కుపితుడై దర్జీని వున్నవాణ్ణి వున్నట్టు పట్టుకు రావలసిందని భటులను ఆజ్ఞాపించాడు. భటులు వెళ్లి అతణ్ణి కనిష్కుడి దగ్గరకు లాక్కువచ్చారు.

ఇంత అలస్యానికి కారణం ఏమిటని దర్జీని కఠినంగా ప్రశ్నించాడు కనిష్కుడు. అందుకు దర్జీ చేతులు జోడించి, "మహా ప్రభూ! యిందులో నా తప్పేమీ లేదు. తమరు అంగరకా కుట్టమని ఇచ్చిన పట్టుగుడ్డ మీద రెండు పాదచిహ్నాలు నేయబడివున్నవి. గుడ్డను ఎటు తిప్పి కుట్టినా ఆ పాదచిహ్నాలు తమ వీపుమీదకు



రాగలవు. తమరే చిత్తగించండి! ''అంటూ పట్టుగుడ్డను కనిష్కుడికి యిచ్చాడు.

కనిష్కుడికి పట్టరాని కోపం వచ్చింది. పట్టుగుడ్డను సూక్ష్మంగా పరిశీలించి చూస్తే, దర్జీ చెప్పినది సత్యమే అని తెలిసింది. ఇక అతడి రౌద్రానికి అంతు లేదు.

'' ఈ కన్యాకుబ్జ సామంతుడు నన్నే అవమానిస్తాడా? వాడిపొగరు అణుస్తాను,'' అంటూ కనిష్కుడు మంత్రినీ, సేనానాయకుణ్ణీ పిలిపించి సంప్రతించాడు. వారం రోజులకల్లా సర్వసైన్యాన్నీ సమాయత్తపరిచి, కన్యాకుబ్జ రాజ్యం మీదికి దండయాత్ర బయలుదేరాడు.

కనిష్కుడు సైన్యంతో తన దేశంమీదికి దండెత్తి వస్తున్నాడన్న వార్త కన్యాకుబ్జ రాజుకు తెలిసింది. బలవంతుడైన కనిష్కుణ్ణి తను ఎదిరించలేనని కన్యాకుబ్జ రాజు గ్రహించాడు. ఇక కర్తవ్యం ఏమిటి?

రాజు, రానున్న ఉపద్రవాన్ని గురించి మంత్రితో చెప్పి, ''ఏదైనా వుపాయం ఆలోచించు!'' అన్నాడు.

అందుకు మంత్రి, ''మహారాజా! నేను ముందే తమకు ఆ రకమైన కానుక పంపవద్దని మనవి చేసుకొన్నాను. కోరి నిద్రపోతున్న తాచుపాము తోక తొక్కారు. ఇది చేజేతులా తెచ్చి పెట్టుకొన్న ఉపద్రవం!'' అన్నాడు.

ఇందుకు, రాజు తల వూపి, ''సరే, జరిగిపోయిందేదో జరిగిపోయింది. విచారించి ప్రయోజనం లేదు. ఏదో ఒకటి ఆలోచించిచేయకపోతేమనకు ప్రాణాలూ, రాజ్యమూ రెండూ దక్కవు!'' అన్నాడు విచారంగా.

అప్పుడు మంత్రి యిలా చెప్పాడు: ''మహారాజా, ఐతే మీరు ఎందుకు అని ప్రశ్నించకుండా, వెంటనే నా చేతిని నరికించండి.''

మంత్రి యిలాంటి కోర్కె వెలిబుచ్చే సరికి కన్యాకుబ్జ రాజు కళవళ పడ్డాడు.

ఆయనకు రాజభక్తి పరుడైన మంత్రికి అంగవిచ్ఛేదం కలిగించటం సుతరామూ యిష్టం లేదు. కాని, చేసేది ఏమీలేక తలారిని పిలిపించి మంత్రి చేతిని నరికించాడు.

వారం రోజుల తర్వాత మంత్రి ఒక ఉత్తమాశ్వాన్ని ఎక్కి, కనిష్కుడు సైన్యాలతో వస్తూన్న మార్గానికి ఎదురుగా వెళ్ళాడు. కన్యాకుబ్జ రాజ్య సరిహద్దుల వద్ద కనిష్కుడిని కలుసుకొన్నాడు.

"మహారాజా, నేను కన్యాకుబ్జ రాజ్య మంత్రిని. ఆయన తమకు చేసిన అవమానాన్ని వారించ ప్రయత్నించిన ఫలం అనుభవిస్తున్నాను," అంటూ మంత్రి, విచారంగా కనిష్కుడికి తన మొండిచేతిని చూపించాడు.

కనిష్కుడు మంత్రి చెప్పినదంతా విన్నాడు. అతడు రాజువల్ల శిక్షింపబడిన వాడనీ ఆ శిక్ష కూడా తన కారణంగానే జరిగిందనీ భావించాడు.

"సరే, ఆ పొగరుబోతుకు తగిన శిక్ష విధిస్తాను. త్వరలోనే వాణ్ణి యమపురికి పయనం కట్టిస్తాను," అని కనిష్కుడు మంత్రిని వూరడించాడు. కాని మంత్రి అంతటితో వూరుకోలేదు.

"మహారాజా, ప్రతీకారం జరిగితేగాని నాకు మనశ్శాంతి కలగదు. మీరు దండెత్తి



వస్తున్నారని తెలసి రాజు పట్టణం వదిలాడు. అతడు ఎటు కేసి పోతున్నాడో నాకు తెలుసు. మనం అతడి దారిని అడ్డగించి పట్టుకోవాలి," అని చెప్పాడు మంత్రి.

కనిష్కుడు సరే అని కన్యాకుబ్జ రాజును పట్టుకోవటం ఎలానో తెలియ పరచమన్నాడు.

అందుకు మంత్రి, "మహారాజా, అతణ్ణి చేజిక్కించుకోవాలంటే మనకు రెండే రెండు మార్గాలు వున్నవి. ఒక మార్గాన్ని అనుసరించిపోతే సరిగా నలభైదినాలు పడుతుంది. రెండో మార్గాన వారం రోజుల్లో అక్కడికి చేరవచ్చును. కాని యీ



మార్గం కంటక ప్రాయమైనది. మైదానం లోంచి మనం ప్రయాణం చేయవలసి వుంటుంది. నీటిచుక్క కూడా లభ్యం కాదు," అన్నాడు.

కనిష్కుడు కొంచెం ఆలోచించిన మీదట యీ రెండవ మార్గాన పోవటానికే నిశ్చయించాడు. ప్రయాణం వారం రోజులే అయినా పది రోజులకు సరిపడా నీరూ, సంబారాలూ పోగుచేయించాడు. సైన్యాలతో మైదాన మార్గంలో ప్రయాణం కట్టాడు.

సైన్యాలు మైదానంలో నడుస్తున్నవి. ఎక్కడా చెట్టూ చేమా లేదు. నీరువున్న ఛాయలే లేవు. పైగా పది రోజులు ప్రయాణం చేసినా గమ్యస్థానం దగ్గిర పడలేదు. ఇంకా ఒకటి రెండు రోజులు గడిచేసరికి ఆహారం మాట ఎలావున్నా, దాహం తీర్చుకునేందుకైనా నీరు లేక సైనికులు బాధపడసాగారు. పది రోజుల కని తెచ్చుకున్న సంబారాలూ, మంచి నీరూ అయిపోయినై.

పరిస్థితి యిలా ఎదురుతిరిగేసరికి కనిష్కుడు కన్యాకుబ్జ మంత్రిని పిలిచి వారం రోజుల ప్రయాణం అనుకున్నది పన్నెండు రోజులు అయినా గమ్యస్థానం కనబడదేమని ప్రశ్నించాడు. దానికి మంత్రి వికటంగా నవ్వుతూ, "మహారాజా, మిమ్మల్ని కావాలనే నేనీ విధంగా మోస గించాను. మీరేమో మా రాజును యమ పురికి పంపుతానని ప్రతిన పూనారు. కాని, యిప్పుడు మీరే సైన్యసమేతంగా యమ పురికి పోవలసిన కాలం సమీపిస్తోంది. మీరు వెనుదిరిగి పోవాలన్నా, లేక ముందుకే వెళ్ళాలనుకున్నా పన్నెండు రోజులు పడుతుంది. కనుక అందరూ నీటిబొట్టయినా దొరకని యీ మైదానంలో గొంతు ఎండి ప్రాణాలు విడవక తప్పదు. యింతకూ కారణమైన నన్ను ఈ నిమిషం లోనే శిరశ్ఛేదం చేయించినా ఫరవాలేదు. నా శ్రమఫలించింది. రాజకార్యం నెర వేర్చాను," అన్నాడు.

ఈ పలుకులు విన్న కనిష్కుడు ఒక్క క్షణం నిశ్చేష్టుడయాడు. కాని అంతలోనే చిరునవ్వు నవ్వి, "మంత్రీ, నీ రాజభక్తి ఎంతో మెచ్చదగింది! కాని ఒక సంగతి నువ్వు మరచినట్టుంది. నేను దైవాంశతో జన్మించాననేది, వట్టి కట్టుకథ కాదు. నువ్వే చూద్దువుగాని," అంటూ గుర్రం ఎక్కి, దైవదత్తమైన కుంతం చేబట్టి ఒంటిగా బయలుదేరాడు.

కనిష్కుడు ఆ మైదానంలో ఒకటి రెండు కోసులు చుట్టివచ్చేసరికి ఒకచోట ఎండిపోయిన పెద్ద కొలను కనబడింది. అతడు గుర్రం దిగి ఆ కొలను మధ్యకు పోయి తన చేతనున్న కుంతంతో భూమిని ఒక పోటు పొడిచాడు. మరుక్షణానే ఆ కుంతం భూమిలో దిగినచోటు నుంచి ఒక జలధార బయలుదేరి ఆకాశమంట లేచింది.

"మంత్రీ, యిప్పుడు చూచావుగదా నా శక్తి ఎలాంటిదో? అనవసరంగా అంగ విచ్ఛేదం చేయించుకున్నందుకు విచార పడవలసింది నువ్వు!" అన్నాడు కనిష్కుడు. మంత్రి సిగ్గుతో తల వంచుకున్నాడు.

కనిష్కుడు తిరుగా సైన్యాలను కూర్చుకొని కన్యాకుబ్జకు బయలుదేరేందుకు సమాయత్తమవుతున్నాడు. అప్పుడు మంత్రి ఆయనను సమీపించి, "మహారాజా, మీరు దైవాంశ కలవారని యిప్పటికి నేను గ్రహించాను. నా యందు కనబరిచిన మీ ఉదారత సాటిలేనిది. యింత ఉదారత్వమూ, దైవాంశకల మీరు యింగితం ఎరుగని ఒక అల్పభూపతి చేసిన అవమానాన్ని సహించి క్షమించలేరా?" అంటూ వినయంగా వేడుకున్నాడు.

కనిష్కుడు, "నిజమే!" అంటూ తల వూపి, సైన్యాలను తన రాజధాని యైన పురుషపుర మార్గం పట్టించాడు. మంత్రి ఆయన వద్ద సెలవు తీసుకొని కన్యాకుబ్జకు చేరి, రాజుకు ఈ శుభవార్త తెలియబరిచాడు.



# శత్రు సంహారం!
































గట్టి పళ్ళకోసం, పిప్పిపళ్ళు రాకుండా నిరోధించడంకోసం—బినాకా ఫ్లోరైడ్.

# మీనాకి ఒకప్పుడు జామెట్రీ అంటే బోర్...

మీనాకి జామెట్రీ అంటే మాత్రం బోలెడు విసుగు, బోరింగ్,
అదంటే ఆమెకి అసలు ఏమీ ఇష్టం ఉండేది కాదు.
ఆ ఖచ్చితమైన గురుకోణములు, ఆ సమాంతర చతుర్భుజాలు
ఆ షడ్భుజాలు.. తలచుకుంటే చాలు ఆమెకి బోర్.
అయితే ఓనాడు ఏమయిందంటే... వాళ్ళన్నయ్య రాజు
ఆమెకోసం పసుపు ఆకుపచ్చ రంగులతో బంగారంలా
అందంగా మెరిసిపోయే కాంపస్ బాక్స్ తెచ్చాడు.
ఆ బాక్స్, ఆ బాక్స్‌లోని ఇన్‌స్ట్రుమెంట్స్ చూసే సరికి
మీనాకి ఎంతో ముచ్చట వేసింది. ఆ రాత్రి తను త్రికోణం
ఎక్కుతున్నట్లు, సున్నాలో గుండ్రంగా తిరుగుతూ
విహరిస్తున్నట్లు, స్కేల్ మీద బ్యాలెన్స్ చేస్తున్నట్లు
కలకంది...ఎంతో సరదా అయిన కల అది.
ఇప్పుడు ఆమెకి జామెట్రీ అన్నా, ఆ షడ్భుజాలన్నా
ఆ సమాంతర చతుర్భుజాలన్నా సరదా పుట్టింది.
మీనాకి జామెట్రీ అంటే ఇష్టం ఏర్పడిందంటే మరి
ఆశ్చర్యంగా లేదూ?





## కెమెల్
ఇన్‌స్ట్రుమెంట్ బాక్స్






కేమ్లిన్ ప్రైవేట్
లిమిటెడ్
ఆర్ట్ మెటీరియల్స్ డివిజన్
జె. బి. నగర్
బొంబాయి-400 059.



కేమ్లిన్ అన్‌బ్రేకబుల్ పెన్సిళ్ళ
ఉత్పాదకుల సమర్పణ.

VISION 794 TEL

**Results of Chandamama—Camlin Colouring Contest No. 9 (Telugu)**

*1st Prize*: J. Sudhakar, Hyderabad - 500 024. *2nd Prize*: B. Satish, Vizag. - 530 001. *3rd Prize*: K. Kamakshi, Hyderabad. *Consolation Prizes*: Morarji Veera Brahmandra, Tuni; M.S. K. V. Nagawarrao, Eluru - 6; Panda Golla Babu, Ganugalapeta; M. Sudheer, Anantapur; M. Venketa Rao, Kotpad.